

ద. భా. హిందీ ప్రచార సభ ఉపాధ్యక్షులు, కేరళ గవర్నరు డా. బూర్గుల రామకృష్ణారావు గారు ఇటీవల హైదరాబాదు సందర్శించిన సందర్భంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర [illegible] సన్మానసభ [illegible] ఒడినది.



ది. 17.4 60న తెనాలి హిందీ ప్రచారక విద్యాలయ సమావర్తనోత్సవం,

ఫోన్: 2066 టెలిగ్రామ్: హిందీసంఘ్
సంపుటి 7 సంచిక 4

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక



దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర
959, ఖైరతాబాదు — హైదరాబాదు - 4

సంవత్సర చందా రూ. 4-00 | జూలై 1960 | విడిప్రతి 35 నయాపైసలు

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో



## ముఖ్య గమనిక

స్రవంతి పేర పంపు డ్రాఫ్టులను, చెక్కులను కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర అను పేరున వ్రాసి పంపగలరు.

సంపాదకులు

**సంపాదకీయం**

# నేటి కవిత

ప్రతియుగానికీ ఉత్తరయుగం క్షీణయుగంగానే ఉంటుంది. ఒక జీవనసంచలనం తెచ్చిన ఒకవరదతో ఒక సర్వోత్తేజన ఉప్పొంగి ఒక కొంతమంది కవులను ఒడ్డున పడవేస్తుంది. తరువాత వరదచీలి పాయలై ఇరుగడలా ఒడ్డును సైతం కోయలేక ఒరయలేక సన్నగా దైన్యంగా పారుతుంది. ప్రబంధోత్తరయుగంలోను ఇప్పటి అభ్యుదయోత్తరయుగంలోనూ మనం ఇలాంటికవితనే చూస్తున్నాము. ప్రబంధోత్తరయుగం శృంగారాన్ని చీల్చి అపహాస్యం పాలయింది. అభ్యుదయోత్తరయుగం శృంగారేతరాన్ని చీల్చలేక అపహాస్యం పాలవుతుంది. ఒక నూతన విశ్వమానవ కల్పన, ఒక భుక్తిభోక్తృతా విశ్లేషణ, దానితో కుదురుకున్న కావ్యార్థాలూ, కావ్య సంకేతాలూ ఇవన్నీకలసి ప్రభంజనంలా వీచి నేటి కవికి దక్కినాయి. ప్రస్తుత కవినేటి సమస్యనేదో కచ్చాపచ్చాగా యిచ్చివేసి కూర్చున్నాడు. ఇది చాలదు. కొంచెం శాంతపడి దానిని అణు పరమాణువులుగా విభజించి జీవితపు ప్రతి సిరలోనూ దానిని నింపే స్థైర్యాన్ని కూర్చుకోవాలి. దీనికి చాలా ఓపిక కావాలి. అధ్యయనం, నిష్ఠానియమం చాలా కావాలి. కాని ఈ కవి దీనికి ఓటు వడినట్టు పరాభూతుడైనట్టు తిరిగి ఛాయా కల్పనలనే వునరుజ్జీవింప చేస్తున్నాడు. ఛాయా కల్పనలో నారీ భావన ఉంది. ప్రగతిలో ఉన్న పుంభావాన్ని తట్టుకోలేకనే ఈ నారీత్వాన్ని ఉపాసించుతున్నాడా! కాదు. ఇది కొంతా అది కొంతా కలుపుతున్నాడు. ఆ కలపడం ఎలాగు! అంతశ్శక్తి లేకుండా, పైపై లేలేత కుంచియలతో.

కవికి తన్నిష్ఠత, తదనుభూతి కావాలి. అతని తత్త్వం అతనిలో ఘనీభవించి, అతనిలో ద్రవీభవించి అతని భావనకు రూపురేఖలివ్వాలి. పెద్దనలోని పౌరాణిక భావన ప్రవరుణ్ణి దిద్దుకుంది. పెద్దనలోని శృంగార భావన వరూధినిని చిత్రించుకుంది. ఇప్పటి కవికి అట్టి చిత్తశుద్ధిగానీ, ఇట్టి మసృణ మాంసలతగానీ లేదు. పోతే 'సంస్కృతి' పేరుతో అతీతాన్ని సంస్కరిస్తున్నారు కొందరు

ప్రయోగపరిణతబుద్ధులు. తెలుగులో ఈ సంస్కృతికి బదులు సాంప్రదాయికత గూడుకట్టు కుంటుంది. ఛాయా కవితలో నారీ భావన ఉన్నట్టు ఈ సాంప్రదాయిక కవితలో మంకుతనం ఉంది. తెలుగు నాట ఈ మంకుతనం కూడా ఒక స్కూలు. దీనికి కారణాలు ఇతర సాహిత్యాలలో లేనివి చాలా ఉన్నాయి. , కవులగణింపు ఏవేవో మాన్యతల మీద ఆధారపడి ఉండటం ఇందు ఒకటి. భాషా కవులనీ, శబ్ద కవులనీ, వ్యుత్పత్తి కవులూ, ప్రతిభా కవులనీ, అప్రతిభా కవులు, అభ్యుదయ కవులూ, అనభ్యుదయ కవులు ఇంకా ఎన్నో. ఇలాంటి వర్గీకరణలు చాలా ప్రారంభికమైనవి. ఈ తెగలలో ప్రతిదీ తనకు తాను గొప్పదీ మన్నికగలదీ, పరస్పరం సరిపడనిదీ. ఇలా చీలిపోయిన కవితా వేదిక మీదనుంచి మనం ఏకోన్ముఖమైన సృజన క్రమోన్మీలనం చూడలేము. కావ్యాత్మను బట్టిచూస్తే అసలు కవి ఒకడే. ఏ కవి ఐనా చివరకు సాధారణ జ్ఞానంలో నేటి సాధారణ లోకచేతనా స్థాయివరకైనా రావాలి. అక్కణ్ణుంచి పెరగాలి, నడవాలి, నడిచి పరుగెత్తాలి. ఆ హద్దును కూడా దాటలేనప్పుడు అతడు కవివాచ్యుడు కూడా కాదు. నానా రకాలైన శిల్పాలు ఇప్పటికే కవికి చాలా అబ్బినాయి. ఎన్నో రకాలైన చిత్ర విచిత్ర శైలులు, ఈ కర్బుర శరీరాన్ని ఏ ఆత్మకు తొడగాలి? ఇదీ నేటి ప్రశ్న. అసలు శరీరాన్ని తీసుకువెళ్లి ఆత్మకు తొడగడ మనేదే ఒక వ్యత్యయం. కవిలోంచే ముందు ఆత్మపుట్టాలి. ఆత్మ తరువాత అనుభూతి పుట్టాలి. దానిమీద ఊహపుట్టాలి ఆ తరువాత నడక తీరూ, ఒద్దిక, కొన్ని శబ్దాలూ, వాటికి మళ్లీ అర్థాలూ. అప్పుడు అది వాగర్థమయిూ అవుతుంది. దీనికి కేవల సంప్రదాయ బద్ధ కవితా గారిష్ఠ్యం ఉన్నా చాలదు. కేవల భేరీపటహనినాద ఝాంకృతులున్నా చాలవు. కేవలం కళా కైశికీ లాస్యం ఉన్నా చాలదు. ఒక తీవ్రానుభూతి, ఒక చిత్తశుద్ధి, వికాసోన్ముఖమైన మేధస్సు, పరంపరాగతమైన పారిశుధ్యం ఇవన్నీ కావాలి. అట్టి ఒక బలిష్ఠుడైన కవి ఉద్భవించాలి. అంతవరకూ ఈ యుగమును క్షీణ యుగమనాలి.



కవిత:

# అస్తి నాస్తి

—శ్రీ శనగన నరసింహస్వామి.

నాకలోకము నిమ్న వినాకరించి
బాల్యమున నేను నడచిన బాట లేదు
నా పసి యెడంద మోసిన నాటి నీదు
చరణ ముద్రలు నేటికి చెరగ లేదు.

తరుణ భావమదాంధ సుందరుడ నేను
నాకు లోకము సత్య సుందరము నేడు
కష్ట జీవిత పథకంటక వ్యథార్త
మతులు నీవును నాకు ప్రకృతి వికృతులు.

సారె సారెకు నీవు హస్తములు సాచి
పిలిచితివి కౌగిలింప నీ వలపు విసము
గా గ్రహించుచు దూరముగా తొలంగి
ఓ మహాదేవ ! సర్వ బాహ్యుండ నైతి.

కవిని నేనను దుర్జ్ఞాన గరిమ నిను ని
రాదరించితినే కాని ఆది కవి ! త్వ
దేక విరచిత విశ్వ మహీయ కావ్య
బంధమున నక్షరంబైన పలుక లేను.

ఎంత దిగజారి పోయిన నీ యమాయి
కాత్మపై గగ్గె నీకు దయాలవమ్ము

అపుడపుడు వేదనానయనాంబ రాంబు
దాంతర జ్యోతిపై తళుక్కని మెఱయుదు.

గగన గంగా తరంగ మంగళ కిరీట
ధారి ! హిమగిరి దీర్ఘ శరీరి ! తావ
కీన పాదాంత రేణు సంకీర్ణ శీర్ణ
మృదు పిపీలిక నేను క్షమింతొ లేదొ ?

["పాంథ గీత" నుండి]



వ్యాసము

# నవల - కథాసంవిధానము - శిల్పము

—శ్రీ జె. విశ్వమిత్ర.

నవల నవీనయుగపు ప్రసాదము. ఇది కావ్యనాటకముల కంటె నవీన తరమైన సాహిత్య రూపము. మానవ ప్రవృత్తులను బట్టి విచారించినచో నవల కాధార భూతమైనది కుతూహలమని (Curiosity) బోధపడును. ఎందువలన ననగా నవల కథా ప్రధానమైన రచన. కథకు కుతూహలము ప్రాణము. ఇదియేగాక మానవుని యాదిమ ప్రవృత్తులయందు (Premitive Tendencies) కుతూహల మొకటి. మనము చిన్నప్పు డమ్మమ్మ నాయనమ్మల వద్ద విన్న కథలలో కూడా ప్రధానమైన ప్రవృత్తి యిదియే. చరిత్ర దృష్టితో చూచిన మన ప్రాచీన కథలలోను, ఆఖ్యాయికలలోను గూడా ఈ ప్రవృత్తియే ప్రధానముగా కన్పించును. అధునిక యుగమున నవల మన యీ ప్రవృత్తినే సంతృప్తిపరచుచున్నది. కాని యిదియే నవలకు ముఖ్యలక్ష్యము కాదు. మానవుని యందు ప్రకృతి సంబంధములయిన, సామాజికములయిన అనేక విషమ పరిస్థితులను, సమస్యలను జయించుకొనుచు, తన యస్తిత్వమును నిరూపణము చేసికొను ప్రవృత్తి యనాదినుండి యున్నది. నవల మానవుని యీ జిగీషా ప్రవృత్తిని చిత్రించుచు, అతనికాత్మ సాక్షాత్కారము (Self-revealation) నొనర్చును — అనగా నవల మానవుని సంఘర్షమయ జీవితమును చిత్రించి యతని నిజరూపమును వ్యక్తపరచును.

అధునిక నవలను మన ప్రాచీన కథల, ఆఖ్యాయికల, వికాస మనుట యసంగతము. ఎందువలన ననగా మన కథలు, ఆఖ్యాయికలు, గద్యమున రచింపబడినను, అవి కావ్యమునకు దగ్గరగా నుండును. వాటియందు కల్పనయే యధికముగా కన్పట్టును. కాని నవల మన జీవిత సత్యములను మాత్రమే చిత్రించును. నవల పుట్టుపూర్వోత్తరముల నరసినచో దానికి మూలము 'రోమాన్స్' అని స్పష్టపడును. కాని నవల 'రోమాన్స్' నుండి కథను మాత్రమే గ్రహించినది. "రోమాన్సున చిత్రింపబడు అద్భుత సాహస క్రియలు, ప్రేమ కలాపములు దీనిలో కానరావు. నవలల యందు అప్రాసంగికములు, అసంభావ్యములు నగు ఘటనలకు తావుండదు. రోమాన్సున

నభిరుచి సంఘటనల యందు మాత్రమే యుండును. పాత్రల యందు కాదు. కాని నవలల యందు మన యభిరుచి సంఘటనల యందు కాక పాత్ర పోషణమునందు కలుగును"– అని జాన్‌మర్రీ అను ఆంగ్లవిద్వాంసుని యభిప్రాయము. (The Advancement of English Novel - John Murry P. 81.)

నవల విస్తృతమైన వైవిధ్యములతో నిండిన జీవితమును చిత్రించును. అందువలననే యది మహాకావ్యమున కుత్తరాధికారి (Successor) యనబడుచున్నది. 17వ, శతాబ్దము వరకు యూరపు దేశమున సాహిత్య రచనకాధారములు మహాకావ్యములు, నాటకములు. అదే విధముగా భారతీయ సాహిత్యమునందు కూడా 19వ, శతాబ్దపు ఉత్తరార్ధమునకు పూర్వము సాహిత్యాభివ్యక్తికి సాధనములు మహాకావ్యములు, రూపకములే. కాని తరువాత వాటి స్థానమును నవల యధిష్ఠించినది. దీని యందు మహాకావ్యము యొక్క విపులత, గాంభీర్యము, నాటకములయొక్క క్రియాకుశలత (Activity) దృశ్యవిధానము (Visibility) మిశితమైనవి. అయినను అది మహాకావ్యము కాదు. ఏలన మహాకావ్యము సంపూర్ణ సామాజిక స్థితిగతులను చిత్రించును. పాత్రలు సమకాలీన సాంఘిక విధానమునకు ప్రతినిధులై యుండును. రెంటియందు భిన్నత్వముండదు. ఇది నవలయందు కానరాదు. నవల ప్రధానముగా వ్యక్తికి సమాజముతో కలుగు క్రియ ప్రతి క్రియలను, సంఘర్షణమును చిత్రించును. అప్పుడప్పుడు నవల తన సీమల నతిక్రమించి సంపూర్ణ సమాజ జీవితమును చిత్రించును. అప్పుడది పౌరాణికనవల (Epic Novel) యనబడును. (పౌరాణిక నవల యనదగినది టాల్‌స్టాయ్ రచించిన 'War and Peace' మాత్రమే.) నాటకమునుండి నవల క్రియావంతమగు పాత్ర సృష్టిని (Representation of character in action) గ్రహించినది. నవలయందు దీ క్రియా కుశలత యెక్కువగా నున్నప్పు డది నాటకీయ నవల (Dramatic Novel) యనబడును. నవలపై వీటి ప్రభావమే కాదు, తదితర సాహిత్య రూపముల ప్రభావము కూడా పడినది. భావ కవిత్వపు భావ గరిమ, విషాదాంత నాటకము లందలి కరుణ, సంఘర్షణ, ముక్తకములందలి నీతి, ఉక్తివైచిత్ర్యము నవల యందు కానవగును. ఈ విధముగా నవల తనకు పూర్వమున నున్న వివిధ సాహిత్య రూపముల యొక్క శిల్పగతమైన, (Structural) వస్తుగతమైన (Textural) గుణములను గ్రహించి

వాస్తవికతను (Reality) ప్రాణముగా చేసికొన్నది. ఈ వాస్తవికత నాధారముగా నైకొనియే ఏవిధ సిద్ధాంతముల యందు గలుగు సామయిక పరివర్తనములతో (Timely changes) ప్రాచీన సిద్ధాంతముల సంబంధాసంబంధములను, ప్రస్తుత జీవితపు విలువలకు (Present Values of life) గత జీవితపు విలువలకు గల పరస్పర సంబంధములను నవల ప్రదర్శించును. ఈ సాహిత్యరూప మీ విధముగా యుగ జీవితమును వ్యక్తపరచును.

సృజనాత్మక సాహిత్యము (Creative literature) కళాకృతి యయినచో సిద్ధాంత సమీక్ష (Theoritical Criticism) కళాత్మక దృక్పథము (Artistic View) సిద్ధాంత సమీక్ష సాహిత్యము యొక్కగాని ఏ రచనా విభాగము యొక్కగాని సమస్త సౌందర్యములను ఆస్వాదించుటకు పాఠకునకు మార్గదర్శక మగుటయే కాక వాటికి (సాహిత్యమునకు, దాని వివిధ రూపములకు) ఒక నియమిత రూపము నేర్పరచును.

ఈ దృష్టితో చూచిన నవల యందు రెండు రకములగు తత్త్వములు (Elements) కాన నగును.

1. సంగ్రథనాత్మక తత్త్వములు- (Structural elements) కథా సంవిధానము, పాత్రపోషణము, దేశకాల స్థితిగతులు (Setting).

2. ప్రరోచనా మూలక తత్త్వములు- (Persuasive elements) వాస్తవికతాభ్రమ (Illusion of Reality) వర్ణన (Description) గతి (Tempo). సంగ్రథనాత్మక తత్త్వములు నవల యొక్క రూప విశేషమును నిర్మించినచో ప్రరోచనా మూలక తత్త్వములు దానిని విశ్వసనీయముగా, రమణీయముగా నొనర్చును. సంగ్రథనాత్మక తత్త్వముల యందు ప్రధానమైనది కథాసంవిధానము.

## కథాసంవిధానము :— (Plot)

శరీరమున అస్థిపంజరమునకు గల స్థానమే నవలలో కథాసంవిధానమున కుండును. దాదాపన్ని రకములయిన రచనలకు (మహాకావ్యము, నాటకము, కథానిక (Short story)-కథాసంవిధాన మావశ్యకము. అయినను నవల యొక్క కథాసంవిధానము తన సహజ విశేషములచేత వేరుగా నుండును. కథాసంవిధానమును గురించి తెలిసి కొనుటకు పూర్వము

దానికి మూల రూపమగు కథాతత్త్వపు పరిచయ మావశ్యకము. (Story element.)

నవలాకారుని మనస్సున తన రచనా నిర్మాణమును గురించి యేదో యస్ఫుటమైన యూహ (Sketch) యుండును. దానివల్ల నతడు కాలాను క్రమమున (Time Sequence) కొన్ని సంఘటనలను సమ కూర్చుకొనును. ఆ కాలానుక్రమమున జరుగు సంఘటనల పరంపరయే కథ. కథా తత్త్వ మున బుద్ధికి విశేషమైన స్థాన ముండదు. సంఘటనల ప్రవాహములో పాఠకు డెప్పుడును వాటికార్య కారణ సంబంధములను ఆలోచింపడు. ముందేమి జరుగునో యన్నదాని పైపే యతని దృష్టి కేంద్రీకరింపబడి యుండును. చిన్నతనమున విను అమ్మమ్మ నాయనమ్మల కథలలో కుతూహలమేగాని (Curiosity) విమర్శనా దృష్టి కానరాదు. మన ప్రాచీన కథా సాహిత్య మున గూడ విమర్శనా దృష్టికి ప్రాధాన్యము లేదు. పాఠకుని మనస్సున ననిశ్చయాత్మక పరిస్థితిని (Suspense) కలుగుజేయు సంఘటనలను కల్పించి పాఠకుని యౌత్సుక్యమును నిరంతరము నుద్దీపింప జేయుట వాని యుద్దే శ్యము. సారాంశ మే మనగా ప్రాచీన కథలయందు, అఖ్యాయికల యందు కథా తత్త్వమే ప్రధానము. పంచతంత్రము, హితోపదేశము నిందుకు నిద ర్శనములు.

సామాన్యముగా ననిశ్చయాత్మక పరిస్థితి (Suspense) కథాసంవిధా నాంశమని తలంతురు. కాని యది కథయొక్క గుణము. ఎందువల ననగా ఒక సంఘటన జరిగిన పిదపనే పాఠకుని మస్సున తరువాత నేమి జరుగునో యన్న భావ ముదయించును. ఆ నిశ్చయాత్మక పరిస్థితి తరువాత సంభ వించు సంఘటనల ద్వారా తొలగును. అనగా సంఘటనల యందు( కథ యందు ) అనిశ్చయాత్మక పరిస్థితి యుండును. దానిని నిర్మూలింపజేయు నదియే కథా సంవిధానము. కథవలన నొక కాలక్రమమున జరుగు కొన్ని సంఘటనల భావము స్పష్టపడును. కాని యా సంఘటనలను రచయిత తన కల్పనా బుద్ధుల రెంటి ద్వారా సరిదిద్ది వాటికి సార్థకమైన, సోద్దేశ్యమైన రూపము నొసగును. సారాంశ మేమన రచయిత వివిధ సంఘటనల మధ్య కార్య కారణ సంబంధమును నిరూపించును. ఒక పాశ్చాత్య విమర్శ కాగ్రేసరుని మతమున ఒక నిర్దిష్టమైన కాలానుక్రమమున జరుగు సంఘట నల వర్ణన, కథ, కథాసంవిధానము కూడ 'సంఘటనలనే చిత్రించును. కాని

యది సంఘటనల వర్ణనలో కార్య, కారణ సంబంధములకు ప్రాధాన్య మిచ్చును.[1] ఇదియే కాక నవలా కారుడు కథాసంవిధానము యొక్క-ఆది మధ్యాంతముల నిర్వహణ, సంఘటనల వ్యవస్థీకరణ యందు పాఠకుని యభిరుచిని (Interest) పెంపొందించు నటువంటి గతిని (Tempo) సృష్టించును. అప్పుడే కథాసంవిధానము పూర్ణమయి, సార్థకమయి, స్పష్టమగును.

అత్యాధునిక నవలలయందు కథా సంవిధానము లేదని కొందరందురు. కాని యది సత్యదూరము. విశేషమేమనగా అత్యాధునిక నవలల యందుగల కథా సంవిధానము పరంపరా పరిమితులలో (Traditional limits) నుండదు. 'అరిస్టాటల్' నుండి 19వ, శతాబ్దము వరకు కథాసంవిధానము ఆదిమధ్యాంతములు, పూర్వాపర క్రమములు గలిగి పూర్ణత్వమును చేకూర్చునది యను సిద్ధాంతము ప్రబలి యున్నది. ఈ సిద్ధాంతానుగుణమయిన కథాసంవిధానము పాతఫక్కీలో వ్రాయుచున్న నవలలలో కాననగును. కాని యిది యత్యాధునికములైన మనస్తత్వ సంబంధి (Psychological) నూత్నశిల్పానుగుణ్యములగు నవలల యందు కానరాదు. జేమ్సుజ్వాయిస్, వర్జీనియా వుల్ఫ్ కొనార్డ్, అజ్ఞేయ్, (హిందీ) బుచ్చిబాబు మొదలగు వారి నవల లిందు కుదాహరణములు. వీటియందు సంఘటనల వర్ణనయే కాక కేవలము మనస్థితుల వర్ణన కూడ నుండును. ఇందుచేత నూతన నవలలయందు కథా సంవిధానము గుర్తింపవలెనన్నచో కథా సంవిధాన నిర్వచనమును మార్చవలయును. కథా సంవిధానము నీవిధముగా నిర్వచింప వచ్చును. ఏదేని కాలాను క్రమమున జరుగు సార్థకములగు (Significant) బహిరంగములు లేక యాంతరంగికములైన సంఘటనల వర్ణనకు సంపూర్ణత చేకూర్చు నదియే కథా సంవిధానము.

**కథాసంవిధానపు సేకరణ, నిర్మాణము:—**

సామాన్యముగా రచయిత తన యనుభూతి (Feeling) ద్వారా దైనిక జీవితము, చరిత్ర మొదలగు వానినుండి విషయమును సేకరించును.

---

[1] E.M. Forster:–

"We have defired a story as a narrative of events in their time sequence. A plot is also a narrative of events, the emphasis falling on Causality."

Aspects of the Novel P.82.

అతడు సేకరించిన విషయ సామగ్రికి కల్పనా సానుభూతులను మేళవించి దానిని ప్రాణవంతముగా ప్రభావ పూరితముగా నొనర్చును. అతడు, అనుభూతి, కల్పన (Imagination) సానుభూతి(Sympathey) అను మూడింటి ద్వారా కథాసంవిధాన మొనర్చును.

ఈ జగములో నెన్నియో సంఘటన లెల్లప్పుడు జరుగుచుండును. ఆ సంఘటనల ప్రతిక్రియ (Reaction) రచయిత యందెన్నో విధములుగా రూపొందును. అతడు తనకు కలిగిన ప్రతిక్రియలలో కొన్నింటిని మాత్రమే గ్రహించి కథాసంవిధాన మొనర్చుటకు ప్రయత్నించును. తనను లక్ష్యమును (నిర్దిష్ట పరిణామమును) చేరుటకు వివిధ ప్రక్రియలు లేదా కథాసంవిధానము లతనికి గోచరింప వచ్చును. కాని యతడేదో నొకదానినే గ్రహింపగలడు. కథాసంవిధానమును గ్రహించుట యందు రచయితకు స్వేచ్ఛ కలదని తలంతురు. కాని యతడస్వతంత్రుడు. తాను నవల యందేవిషయమును చెప్పబోవుచున్నాడో, ఏ భావనలను తా ననుభవించి వ్యక్తీకరింపనున్నాడో మున్నగు విషయములు కథాసంవిధానము వైపు రచయిత నాకర్షించును. అప్పుడా కథను వేరే ప్రక్రియతో చెప్పగలిగిన సమర్థత యతనిలో నుండదు. అని 'ఎలిజబెత్ బొవెన్ 'చెప్పినది.[1]

కథా సంవిధానము, సంఘటనలు (Incidents) క్రియా వ్యాపారములకు, (Actions) ఉద్వేగములకు (Emotions) ఒక నిశ్చిత రూప మొసగును. ఈ మూడింటి ద్వారా కథా సంవిధానమును క్రింద చెప్పిన విధముగా నిర్మించుకొనవచ్చును.

1. రచయిత సదా తన కథా సంవిధానమును చక్కగా రూపొందించుట కనావశ్యకములగు సంఘటనలను వదలి వేయుటయేగాక కథకు సంపూర్ణతను, సార్థకతను ప్రసాదించని యంశములనుగూడా తాను గ్రహించిన సంఘటనలనుండి తొలగింపవలయును.

[1] Elezabeth Bowen — "Plot might seem to be a matter of choice. It is not. The particular plot for the particular novel is something the Novelist is driven to ......... He is forced towards his plot. By what ? By what is to be said ? What is 'what is to be said' ? A mass of subjective matter that has accumulated - impressions received, feelings about experience, distorted results of ordinary observation and something else "—

'Writers on writings' P 177 Selected by Walter Allen.

2. సామాన్యముగా కథా సంవిధానమున రూపొందిన యన్ని సంఘటనలలో పూర్వాపర సంబంధమేర్పడియుండును. కథా సంవిధాన మెంత ధృఢముగా, నుండునో యా సంఘటనల పూర్వాపర సంబంధముకూడా స్పష్టముగా బలీయముగా నుండును.

3. ప్రత్యక్షముగా వర్ణించుట యనవసరమని తోచిన సంఘటనలను రచయిత వివరింప సూచింపవలెను. అట్లు చేయుటవలన కథా సంవిధాన మాకర్షణీయమగును.

4. సంఘటనల యమరిక సహజముగా నుండవలెను. ఎల్లప్పుడు పాఠకు డొక దాని తరువాత నొకటిగా సంఘటిల్లు సంఘటనలను చూచి యిదియే సబబయిన సంఘటనయని యనుకొనునట్లు చేయవలయును. ఇంతే కాక పాఠకుడు జరిగిపోయిన వానినిబట్టి రాబోవు సంఘటనల నూహింప లేనట్లుగా సంఘటనలను సమకూర్పవలెను. అప్పుడే కథా సంవిధానము రాణించును.

5. కథా సంవిధానమునందు చిత్రింపబడు మనోభావములు, క్రియా వ్యాపారములు, వాటి ఫలితములు (Results) కిటికవినాభావ సంబంధ ముండవలయును. లేనిచో కథా సంవిధానమం దస్వాభావికత, యసంబద్ధత యేర్పడును.

6. కథా సంవిధానమం దాధికారిక ప్రాసంగికేతివృత్తము లుండును. కథా సంవిధానమును పెంపొందించుట, పోషించుట, యాధికారిక ప్రాసంగికేతివృత్తముల ప్రయోజనము. ఈ రెంటి కవిచ్ఛిన్న మయిన సంబంధ ముండును. లేనిచో కథా సంవిధాన నిర్మాణమున శైథిల్య మేర్పడును.

ఎంత నేర్పుగా కథా సంవిధాన రూపము నేర్పరచినను దానియందు భావప్రవణము లేనియెడల నది పాఠకునిపై ప్రభావమును ప్రసరింపజాలదు.

## కథాసంవిధానపు టభిరుచి:—(Interest)

కథా సంవిధానమును నిర్మించునపుడు రచయిత యెల్లప్పుడు పాఠకునకు విసుగు పుట్టించని సంఘటనలకే తా విచ్చును. కథా సంవిధానపు కౌన్నత్యమునకు, కథాభిరుచియే గీటురాయి. కథాభిరుచిని నిర్వహించు తీరును బట్టియే కథా సంవిధానపు బాగోగు లాధారపడి యుండును.

కథా సంవిధానము పాఠకునకు నచ్చిన విధమనే యతడు దానియందు లీన మగును. కనుక అభిరుచి కలిగించు కథా సంవిధానము నవలకు జీవము. అభిరుచియే కథా సంవిధానముయొక్క యుపాదేయమని "సోమర్ సెట్ మామ్" వక్కాణించెను. "పాఠకుని యభిరుచిని రేకెత్తించుటకు కథా సంవిధానము ముఖ్యము. పాఠకుని కభిరుచినికల్గించుటయే యీ నవలా సాహిత్యమునకు ప్రధాన గుణము. వలన నిదియే పాఠకుని యందాతడాశించు మనో భావములను రేకెత్తించును." (Sommrset Mangham — 'The Summing up" P. 138)

మానవునియందు కుతూహల మెల్లప్పుడు నుండును. కథా సంవిధానమునందు నిరంతరము కుతూహలమును సృష్టించుటకు ప్రయత్నించుచుండును. అప్పుడే యది పాఠకుని యభిరుచిని పెంపొందించును. కథా సంవిధానమునందు గల యౌత్సుక్యమును (Curiosity) మెల్ల మెల్లగా నుద్దీపింప జేయవలయును.

కథా సంవిధానమందు కుతూహలమును నిరంతరము కొనసాగించుటకు రచయిత కొన్ని పద్ధతుల నవలంబించును. సంక్షేపముగా నవి క్రింద నుదహరింపబడుచున్నవి.

1. పాఠకుని దృష్టి యెల్లప్పుడును నాయకుని కార్యకలాపముల యందు కేంద్రీకరింపబడి యుండును. కావున పాఠకుని కథా సంవిధానమునందు నిమగ్నుని చేయుటకు నాయకుడు వివిధ కష్టములను, జీవిత సమస్యలను ఎదుర్కొని వాటి నధిగమించినట్లుగాని లేదా వాటి కాహుతి యైనట్లుగాని చిత్రింపవలయును.

2. కథా సంవిధానము నూతన పాత్రలను సృష్టించిగాని లేదా "డైనమిక్" (Dynamic) పాత్రల సృష్టివలనగాని కథా సంవిధానము నభిరుచి చేకూర్చునదిగా చేయవలయును.

3. కథా సంవిధానమందు గల సంఘటనలను త్వరత్వరగా ఘటించునట్లు సమకూర్చినచో పాఠకున కానందము కలుగును.

4. సంఘటనల కారణములను మరుగుపరచి కథా సంవిధానమందు పాఠకుని కభిరుచిని కలిగింపవచ్చును. సంఘటనల యీ రహస్యము కొంత వరకు పాఠకునకు, మరి కొంతవరకు వేరు పాత్రలకు అగమ్యముగ నుండి తరువాత స్పష్టమయినచో దానివలన పాఠకున కానందము కలుగును.

5. సంఘటనల క్రమము నుల్లంఘించికుండా కథా సంవిధానము నందు అభిరుచిని పుట్టించవచ్చును.

## కథా సంవిధానము-వర్గీకరణ :—

నవలల్లలో కథా సంవిధాన మనేక రూపములతో కన్పట్టును. వాని నిబంధనము ప్రధానముగా మూడు విధముల విభజింపవచ్చును.

**1. విషయ ప్రధానము :-** వర్ణ్య విషయము ననుసరించి కథా సంవిధానము పలు విధములుగా నుండును. (1) సాహస ప్రధానములగు కథా సంవిధానములు (2) ప్రేమ ప్రధానమైన కథా సంవిధానములు (3) జానపద కథా సంవిధానములు (4) ఐంద్రజాలిక కథా సంవిధానములు (5) వేదాంత సంబంధిక కథా సంవిధానములు (6) చారిత్రాత్మక కథా సంవిధానములు (7) సామాజిక కథా సంవిధానములు (8) మనస్తత్వ సంబంధి కథా సంవిధానములు మొదలయినవి.

**2. శిల్ప ప్రధానము :-** వర్ణ్య విషయము ననుసరించి వర్గీకరించుట కన్నను శిల్పము ననుసరించి కథా సంవిధానమును వర్గీకరించుటయే మిక్కిలి ప్రధానము. శిల్పము ననుసరించి వర్గీకరణము ద్వివిధము.

(అ) మొదటిది నవల యందలి ప్రధాన తత్వము ననుసరించి కథా సంవిధానము రూపొందించుట. ఇది కూడా పలు విధములు.

**1. సంఘటనా ప్రధానమయిన కథా సంవిధానము :-** ఈ శ్రేణికి చెందిన కథా సంవిధానములయందు సంఘటనలకే ప్రాధాన్య ముండును గాని పాత్ర పోషణకు కాదు. "డిటెక్టివ్" నవలల కథా సంవిధానము లన్నియు ఈ శ్రేణికి చెందినవి.

**2. పాత్ర ప్రధానమయిన కథా సంవిధానము :-** ఇందు సంఘటనలకు ప్రధాన స్థానమీయక పాత్రల శీల వైచిత్ర్యములు తెలుపబడును. ప్రపంచమున ప్రసిద్ధికెక్కిన నవలల కథా సంవిధానము లీ శ్రేణికి చెందినవిగనే యుదహరింపవచ్చును.

**3. దేశ కాల చారిత్రక ప్రధానమైన కథా సంవిధానము :-** దీని యందు దేశ కాలముల కెక్కువ విలువ నొసంగి వాని ప్రత్యేకత చిత్రింపబడును. చారిత్రక నవలా కథా సంవిధాన మీ శ్రేణికి

చెందినది. ఇదియేగాక యేదేని యొక ప్రాంతీయ సంస్కృతిని చిత్రించు నవలల కథా సంవిధానముకూడా ఈ వర్గమునకు చెందినది. హిందీలో ఫణీశ్వరనాథ్ రేణు నవల లిందు కుదాహరణములు. థామస్ హార్డీ నవలలయందు కూడా ఈ విశేషమే గోచరించును. వారి "Return to the Native" ఇందుకు నిదర్శనము.

(ఆ) సంగ్రథనము ననుసరించి (Structure) కథా సంవిధానము నాలుగు రకములు. ఈ విభజనము ననుసరించియే మనము కథా సంవిధానముయొక్క నిజ రూపము తెలిసికోగలము. ఆ నాలుగు రకములు క్రింద ఉపహరింపబడుచున్నవి.

(1) **ఏకార్థ కథా సంవిధానము (Simple)** :- ఇందు సంఘటన లన్నియు నొకే లక్ష్యముపై కేంద్రీకరింపబడి యుండును. ప్రాసంగికేతివృత్తములు లేకపోవుటచే కథా సంవిధాన వికాసమున నిరోధము లుండవు.

(2) **బహుకార్థ కథాసంవిధానము (Compound)** :- దీని యందు రెండు మూడితివృత్తము లున్నప్పటికి నన్నియు నొకే లక్ష్యసిద్ధికి తోడ్పడును.

(3) **అననుస్యూత కథా సంవిధానము (Organic)** :- ఇందు సంఘటన లన్నింటికి పరస్పర సంబంధ మేర్పరచి వాటి యన్నిటికి కార్య కారణ సంబంధములు సమకూర్చబడును. కథోప కథ లెన్ని వచ్చినను వాని యన్నిటియందును అవిచ్ఛిన్నమైన సంబంధము సృష్టించి యవన్నియు సార్థకము చేయబడును.

(4) **అననుస్యూత కథా సంవిధానము (Loose)** :- ఇది పటిష్టముగా నుండదు. దీనియందు పెక్కు కథోప కథలకు స్థాన ముండును. కాని వాటన్నిటికి సరియైన కార్య కారణ సంబంధములు, పూర్వాపర సంబంధములు కానరావు. ఈ కథా సంవిధానము విస్తరించి పటిష్ఠముగా నుండకపోవుటచే పాఠకుకెక్కువ యాకర్షింప జాలదు.

3. **శైలీ ప్రధానము** :- శైలి ననుసరించి కథా సంవిధానము నాలుగు విధములు.

(1) ఐతిహాసిక కథా సంవిధానము:—ఇందు నవలా రచయిత తటస్థుడై చరిత్రకారునివలె కథను వర్ణించును. రచయితకు కథకు ప్రత్యక్ష సంబంధ ముండదు. తన యుద్దేశ్యములను రచయిత పాత్రల మూలముగా వ్యక్తీకరించును. నవలా సాహిత్యమం దిటువంటి కథా సంవిధానములు కలిగిన నవలలే యధికము.

(2) ఆత్మ చరిత్రాత్మక కథా సంవిధానము :- ఇందు రచయిత ప్రధానుడై నేరుగా తానేనై కాని లేక పాత్ర స్వీయకథను చెప్పుచున్నట్లుగా గాని కథను రచించును.

(3) లేఖాత్మక కథా సంవిధానము:- (Epistolatory) :— ఇందు రచయిత లేఖల మూలముగా (ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా) కథను వర్ణించును. ఆంగ్లములో 'రిచర్డ్ సన్' వ్రాసిన 'పామలా' 'క్లారిసా' నవల లిటువంటి కథా సంవిధానము కలిగినవే.

(4) డైరీ మూలక కథా సంవిధానము :- డైరీలో దిన చర్యలను లేక ప్రముఖ ఘట్టములను ఏ విధముగా వ్రాసికొందురో యదే విధముగా నవలలోకూడా కథా సంవిధానము నాయకునిదిగాని లేదా యితర పాత్రలయొక్కగాని దిన చర్య రూపమున వర్ణింపబడును. ఇటువంటి నవలలు చాలా తక్కువ. తుర్గనేవ్ "వార్ట్" యిట్టి కథా సంవిధానమున కుదాహరణము.

నవలాకారుడు పై నుదహరించిన రచనా పద్ధతులయందే కథను వర్ణించవలయునను నిర్బంధము లేదు. అతడు నూత్న మార్గములనుకూడా ప్రవేశ పెట్టవచ్చును. ఉదాహరణకు రోగర్ క్రోవెస్, "డిస్టెంట్ డ్రిమ్స్" అను నవలయందు కేస్ బుక్స్, డైరీ, లేఖలు, వార్తా పత్రికల భాగములు [Clippings] మొదలగువాని నుపయోగించెను. మరి కొన్ని నవలల కథా సంవిధానములు చలన చిత్రాత్మకములైన క్లోజప్, స్లో అప్, న్యూస్ రీల్ మున్నగు పద్ధతులతో వర్ణింపబడినవి. జాన్ డాస్ పాసొస్ వ్రాసిన 42nd Parallel ' ఇందు కుదాహరణము.



కవిత :

# రస ప్రసువు

—శ్రీ యస్వీ జోగారావు

నా తను సహకారము నాశ్రయించిన
నవ మల్లిక నన లెత్తదు
నా కింతయు చింత లేదు
నా కృతులే నా బిడ్డలు

ఆ బిడ్డల కని పెంచుటలో
గల ముద్దూ ముచ్చట
లచ్చముగా ఆ తల్లివి
అవి కేవలము తన తను సంబంధులు

నా కృతి వత్సల మురిపెమ్ములు నావి
అవి నా మనస్సు మన శ్శిశువులు

ఆ బిడ్డలు నా పాలిటి కధ మర్ణులు
ఉత్తమర్ణు లీ బిడ్డలు
ఆ శిశువు లశాశ్వతులు
చిరంజీవు లీ శిశువులు

ఆ బిడ్డలు నన్నొక
తండ్రిని తాత నొనర్తురు
ఈ బిడ్డలు నిత్యం నన్నొక
శిశువుగ మన నిత్తురు

శిశు ముగ్ధము హృదయము
సతతము శివ సమ్మిళితము.

—(నా 'ఉపనిషత్తు' అను కావ్యమునుండి)

వ్యాసము.

# జర్మన్ నవలోద్ధరణము

—శ్రీ బొడ్డపాటి కుటుంబరాయ శర్మ

ఇంగ్లాండు, నమెరికాలయందుఁ గథా సాహిత్యమని వ్యవహృతిఁ బొందిన సాహిత్య ప్రక్రియ, పందొమ్మిదవ శతాబ్ద్యంతము వఱకును జర్మనీయందు సువిదితము గాలేదు. ఒక వ్యవస్థగాని, యొక సంప్రదాయము గాని దానిని సమ్మతింపను లేదు. జర్మనులకు మహోదారమైన సారస్వత మున్నది. [1] సాంప్రదాయకమైన రూపకమును, గేయ సాహితియు మాత్రమే గాక, వారిలో నితిహాస రచనముగూడఁ బ్రచారమందున్నది. యశఃప్రసారమునందుఁ బొందిన నష్టము నితిహాస మా దినములలో దాంభికత్వముచేఁ బూరించుకొనుచుండెను. తెలిసి యర్థ్వముగఁ గొన్ని కావ్యములను, దెలియక సిగ్గుచే ననర్థ్వముగఁ గొన్ని కావ్యములను నాటివారు మన్నించుచుండిరి. ఇంతలో నొక క్రమ పరిణామ మనునదియే యెఱుఁగక హఠాత్తుగ బ్రచురణకర్తలచే వెలువడఁజొచ్చిన నీరస కథా సాహిత్యము. నెల్లరు ననివార్యముగఁ జదువవలసినవారైరి. అది ప్రణయ కిమ్మీరిత కథలతో, శృంగార శబలితైతిహాసిక నవలలతో నిండిన లఘు సాహిత్యము. లఘు హృదయుల హాస్యము మొదలుకొని, కఠిన సాంఘికాచార వ్యవస్థితమైన వికృత పాత్రల క్రూర ప్రవర్తనము వఱకు నందుఁ బ్రతిబింబించెడిది. ఇది డికెన్స్, ఫ్లాబర్ట్, తుర్గనీవ్, డాస్టొవస్కీలు స్వర్గస్థులైన యొకటి రెండు దశాబ్దులనాఁటి పరిస్థితి. ఇప్పుడే ఫ్రాన్సునందు విమిలీజోలా, మపాసాలును రష్యాయందు టాల్స్టాయ్, ఛెకోవ్లును తమ యుత్తమ కథా సాహితిని నిర్మించుచుండిరి.

పందొమ్మిదవ శతాబ్దిలో నింగ్లాండు, జర్మనీ దేశముల కథా కథన వైఖరియందలి వ్యత్యాసము ప్రత్యేక గుణ ప్రతిపాదకము, సార్థకమునై యుండెను. ఇంగ్లాండొక యున్నతమైన స్థాయి నందుకొనెను. అందు గుణ గరిష్టులు నుత్తాలురు బెక్కురుండిరి. ఆ స్థాయియందే నిరుపద్రవము ననుస్యూతము నగు నొక సంప్రదాయ మేర్పడినది. ఔచిత్యము నెఱిఁగి యర్థ్వమైన దానిని స్వీకరించు నొక శక్తి రచయితలయందు నెలకొనెను. సర్వ

[1] 'Belles-Letters'

వర్గములవారి జీవితమును నాఁటి సాంఘిక చిత్రముతోఁ బ్రతిబింబించెడిది. ఆ సాహిత్య సం[illegible] పై [illegible] [illegible] [illegible] వచస్సారళ్యమునుఁ దోప్పడిన [illegible] "[illegible]" [illegible] [illegible] [illegible] హాస్యముతో, "థేకరీ" నాఁటి వారి గుంపు శ్రేష్టుఁ డేమో యనిపించును.

ఇఁక జర్మనీయందుఁ జేరొందిన కృతులు కొన్నగలు మహావ్యక్తులు సాధించినవి మాత్రమే [1]! చెప్పఁదగిన వారెవ్వరును వీరి ననుసరించినది లేదు. జాతీయమైన యాధ్యాత్మిక జీవితముపై వీరు చెఱగని ముద్ర వాత్తు కొల్పినదియుఁ గనఁబడదు. వీరిలో నొక్కొక్క రొక్కొక్క ప్రపంచమును సృష్టించిరి కాని, యెవ్వరు నొక సంప్రదాయము నెలకొల్పలేదు. వ్యక్తి గతముగ వారు మహనీయులు. కాని, వారిలోఁ బాఠకులను బ్రేరేచు మాంత్రిక స్పర్శగల ప్రభవిష్ణు వొక్కఁడును లేరు. "గోథేలి"నా [2] వారిలో నెవరికి వారు తమ రాష్ట్రమున కధిపతులు.

ఇందుచే, మహాకావ్య శిఖరములనుండి జర్మను సాహిత్యము పొందిన నిగతికి, నందు సర్వసమ్మతమగు నొక స్థాయి కుదురమికి, నింగ్లాండు ఫ్రాంసుల యందువలె జర్మనీ యందొక సమాజ వికాస మనునది లేమికినిఁ గల హేతువులు విదితమగుచున్నవి. అందును నవలా రచనమున కేసంరస్వతసుందైన నొక స్థాయి యనియుఁ, గనిష్ఠ సామాన్యముగు నొక మూలాధారమనియు, సాంఘికాచార వ్యవహారరూఢములైన కొన్ని సజీవజాతీయ సంప్రదాయములనియు నుండవలెను. ఇంగ్లాండు దేశమునకు లండను వలె, ఫ్రాంసు దేశమునకు పారిస్ నగరమువలె ననేక ఘన కృత్యములకుఁ బూర్వరంగమై, శతానేక సంస్కృతులకు నిలయమై, జాతి సంస్కృతికి గరిమ నాభియై, యావద్దేశమునకు హృదయస్థానస్థ మనఁదగిన యొకానొక ప్రధాన నగరముగూడ

---

[1] Note, the incomparable composition 'Die Wahlvar wandtschaften'; the treasure like Achim von Arnim's 'Kronenwachter'; the announcemental work like Immermann's 'Overhof '; the Profound epic writer like Adalbert Stifter or the attractive and original Gottfried Keller; the creature of genius like E. T. A. Hoffmann, the wonderful Eicheudorff, the Portentous conrad Ferdinand Meyer.

[2] The solitary exception was Goethe, whose novels have never penetrated to the people.

నవలలలో రంగ రచనమునకు, వాతావరణ స్పష్టికిని దోడ్పడు [illegible]
ఆ [illegible]డట్టిది జర్మనీకి లేని వచ్చును [1].

ఆ దినములలో రాజ పోషణము [illegible] పరుల నెవరినైన సందేహోత్పాదకశీలురుగ [illegible]చెడివారు. పదునెనిమిదవ శతాబ్దియందచట దుర్వినీతుడగు సర్వజన విరోధివలె నటుడెట్లు ద్వేషింపబడెనో, పందొమ్మిదవ శతాబ్దియందు సాహిత్యకుడును ద్వేషింపబడెను. అది యానాటి సాధారణ బుద్ధి కుశలత; యానాటి సంఘస్థితి.

అవి లోకాయత మతోద్యమాందోళనము [Swingings of the naturalistic movement], జాతీయ పునరుద్ధరణ వ్యాయుల తారతమ్యమును బట్టియిచ్చు దినములు. అప్పుడు వెనుకటి తరమునకు జెందిన గ్రంథము లెన్నియో వెల్వడినవి. [2] అనగా నొకరిద్దరి [3] తరమునకు జెందిన యుత్తమ కృతులు చెప్పలేదని కాదు. వారి కప్పుడు రాదగినంత కీర్తి రాలేదు; సాహిత్య పునరుద్ధరణ మారంభించినప్పుడే వారికీర్తి వ్యాప్తి గాంచెను.

ఈ నూతన చైతన్యము నొక పారమార్థిక (యాధ్యాత్మిక) విప్లవ మనవచ్చును. రష్యా, నార్వే మున్నగు దేశములలోని మహామహులైన రచయితల ప్రభావమే దీనికి ప్రాతిపదిక. జెన్స్‌పీటర్ జేకబ్‌సెన్ చెప్పిన శాంత మహోదారమైన కవిత్వము మెల్లిగ దారిదీసెను. పిమ్మట గొందఱు తిరుగుబాటుచేయు ప్రవక్తలును [4] దేశదేశముల దలెత్తిరి. వారి తీవ్రశ్వాసలు జర్మనీ యందు యువకుల నుద్రిక్తపరచినవి. వీరికవి యపూర్వానుభూతుల గల్గించెను. వారితోడ దిరుగులేని విప్లవ భావములు ప్రజ్వరిల్లినవి. ప్రజలు గాఢ నిద్రనుండి కొట్టిలేపబడినట్లు మేల్కొనిరి. నిత్య జీవితమున

1 The Buddenbrooks' of Thomas Mann was a piece of good fortune, an exceptional case: as the scion of a Heansee City with Century - old ties, wherein the author had, so to speak, a century - old social back ground.

2 Books of Fridrich Spielhagen of Paul Heyse [Kinder der Welt] and of others.

3 Theodor Fantane was a notable descriptive artist and narrator and Wilhelm Reabe was a quaint artificer.

4 Ibsen, Tolstoy, Strindberg, Bjcornson, Zola and some others.

వినఁబడు మందమంద మైన ధ్వనులు మాత్రమే యీ సమ్మర్దములోఁ దొలు దొలుత నా ప్రబోధితులకు వినఁబడినవి. పిమ్మటఁ గ్రమ క్రమముగఁ దమ భాషయందువలెఁ బల్కరించు కంఠనాద మొకటి ప్రధానముగా విన నయ్యెను. అది ఫ్రెడ్రిక్ నీష్చీ ప్రబోధము. దానికిఁ గడము నాదమయ జగత్తంతయు ననుపల్లవిగాఁ దోఁచినది. రమారమి యీ శతాబ్దారంభ మున జర్మను యువకులను మేల్కొలిపినది నీష్చీయే! అతని దొక తత్వ జ్ఞానబోధ యనికూడ నందురు. అందెంత సత్యమున్నదో యంత యసత్యము నున్నది. తాత్కాలిక పారమార్థిక పరిస్థితులనుబట్టి యాతని బోధ, విమ ర్శనాపరము. విద్యాదాయకమును గాని యాధ్యాత్మికచింతనా ప్రేరితము గాదు. అతఁడు ప్రోత్సహించినది కలవరముగాని యోజనము కాఁజాలదు. ఆతఁ డాందోళన కర్తగాని యోక్తగాఁడు.

నవలాకర్త కొలికి నవతితమ్ముఁడని పూర్వమున్న భావములో నొక మార్పు మెఱసెను. ఇది యీ శతాబ్దియందు, దొలి దశకములో నురవ డించిన స్ఫురణము. కాని, బుభుక్షిత మైన పాఠకలోకము పనికిమాలిన నవల లనే భిక్షింపవలసి వచ్చినది; అట్టి భుక్తితోఁడనే తుందపరిమృజ మైనది. అందుఁ బ్రచారోద్దిష్టములైనవి కొన్ని నవలలు; కొన్ని యుబుసుపోఁక వ్రాసినవి. మఱికొన్ని నీచశృంగార ప్రదర్శకములు, నింద్రియ క్షోభా ప్రేరకములు. కాని, యివి యేచి తలిర్చి తనర్చిన మొలకల పొలుపునే తెలుపును. అనఁగా వీనితోఁ గుడియెడముగఁ 'బుడ్డెన్ బ్రూక్స్' వంటి [1] ప్రసిద్ధ రచనలు రంగ వల్లుల దీర్పలేదని కాదు.

మొత్తముమీఁద నానాఁటి కథా సాహిత్యమునకుఁ జెందిన యిట్టి బుద్ధి సంబంధ మైన ఘటనను స్థూలముగ వాస్తవికతా కాభిముఖ్య మనవచ్చును. విభిన్న విపరీత ప్రవృత్తిగల పాత్ర లింద్రియక్షోభములో విలీ నము లగుచుండుటచే నీ వాస్తవిక విధానమునందుఁ బురాతన మందమంద ప్రస్తుత చిత్రణ ముండదు. ఆదర్శక చిత్రమునందలి యస్పష్టతయు

[1] Gerhaydt Hamptmann's 'Emanuel Quint' was also a famous work. Eminent writers like, Knut Hamsun', who was feted almost as if he were a native Poet, Hermann Hesse Arthur Schnitzler, Henrich Mann, Edward Keyserling and Jacob Wassermann, held the field in those days.

నుండదు. సందిగ్ధాస్పదమై స్వార్థత్రాస్రవణ చిహ్నితమైన యాత్మాశ్రయ సృష్టి కిది సుదూరము. ఇందు సుస్పష్ట రేఖా సమన్విత చిత్రణము, నిర్దుష్ట కళా వరణ దర్శనము నుండును. సరళతయు, విషయ ప్రదర్శనాప్రమత్త తయు నేగాక విస్పష్టార్థగోచరమై యనుకరణ సులభముగాని, వాగ్వ్యాపారముగూడఁ నీ వాస్తవికతకు గమ్యము. ఇట్టి కళకుఁ గఠోరసంయమన మావశ్యకము; గంభీరమైన యాధ్యాత్మిక ప్రవణతయుఁ గావలెను. శృంగార వినోదక్రీడా విశేషములనుండి మనస్సు విముఖమగుటకై బుద్ధిసంబంధమైన యొక వినిశ్చలత ముఖ్యము. అది సాధారణమైన మానుషానుభవములనుండి సంభావ్యమగు నాత్మాభివృద్ధిని సాధించుటకుఁగూడ నెంతో సహాయ్యకారికాఁ గలదు.

సారస్వత క్షేత్ర మిట్టి సంయమనాదులచే పదునై సంసిద్ధముగ నుండుటచే తరువాతి క్షేత్రజ్ఞులకు కర్తవ్యము సులభీకృత మయ్యెను. కళాస్రష్ట దృష్టితోఁ బరిశీలింపఁగా నెప్పుడు నీ వాస్తవికత మఱల నొక కల్పనయే యనిపించుచున్నది. ఈ సృష్టికిఁ బూర్వ మా వాస్తవికత కొక యస్థిత్వమని లేదు. ఇట్లుఁ గల్పింపఁబడిన వాస్తవికముల సమీకరణమును బుద్ధి సంబంధముగల సంప్రదాయమని చెప్పవచ్చును. వాస్తవికత సాధించిన యీ సాంప్రదాయ విధానమే యమెరికనుల సారస్వతమున నీ శతాబ్దియందు రెండుమూఁడు దశకములలో నగపడుచున్నది. ఇది యెంతవఱకు సుదృఢమైన సంప్రదాయముగ నెలకొనఁగలదో దానినిఁ కాలమే నిర్ణయింపఁగలదు. పర్యవసాన మెట్లున్నను సాధనమాత్ర మనన్యము.

జర్మనీయందు సాధారణముగా సరియైన సమయ మాసన్నమగుసరికే దురదృష్టవశమున నొక సర్వశూన్యత్వ మేర్పడుచుండును. దీని నెట్లో తప్పించుకొనకతీరదు. ఇట్టి యా ప్రతి ప్రయత్నమునకు జర్మనీ తన సర్వశక్తులు ధారవోయవలెను. ఒక సాంప్రదాయ నిర్మాణమును, వెనువెంటనే దాని నిర్మూలనమును తఱచుగ నా దేశమున ననివార్య మగుచున్నది. అందుచే శక్తిసామర్థ్యములు వ్యర్థమగుటయేగాక దేశ సంపదయు నిరంతరము వ్యయమగుచున్నది. ఈ వ్యయ ప్రయాసలు జర్మను సాహిత్య పరిణామ మందలి భిన్నభిన్న దశలలో విశదమగును. వ్యక్తుల కృషియందుఁ గూడ నీ విషయము వ్యక్తము కాఁగలదు. జర్మనులలో నొక్కరినుండి ఇంకొక రేవిషయమునైన గ్రహించితి మనుకొనుట కిష్టపడరు. వారిలో

నెవరిమార్గము వారిదన్న యొక యభినివేశము మెండు. తమమార్గమునఁ దమ్ముఁ ద్రాము వంచించుకొనుచు నా యభినివేశమున కభిరుచి యనియో విశిష్టరీతి యనియో యభిమానముతో నామకరణము చేయుదురు. జర్మనీ దేశము సంప్రదాయ విహీనమనెడి నిందాభీతిఁ దొలఁగించి యీ నామకరణమేదో యాత్మవిశ్వాసమును గల్గించును. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము రచయిత'లీరీతిగ సూక్తివైచిత్రి [1] యనెడి శాబ్దికమైన యొకానొక ధ్వజారోహణము చేసిరి. దీనికి జర్మన్ భాషలో నొక పేరున్నది. [2] పేరేదైనను జర్మనీ సంప్రదాయరహితమన్న ప్రధానాంశమునుఁ గప్పిపుచ్చునదియే.

విశేష ప్రజ్ఞా సాధ్యమైన దాని విషయమే వేరు. అది సాధారణ ధోరణిసారణీప్లవము. దాని గుణగణమును నిశ్చయించు సామర్థ్యము సాధారణమైన ప్రజ్ఞకుఁ జాలదు. అది యట్లుండ నపవాదమెప్పుడునుఁ బ్రధాన విధికి (సిద్ధాంతమునకు) బలమునే చేకూర్చుట యొక యదృష్టము. అందుచే సిద్ధాంతమున కపవాదము లనఁదగు నొకటిరెండు విశేషోదాహరణములుండుటయు లోపముకాదు. ఆనాఁడు యుద్ధానంతరము యువక నవలా రచయితల కృషి యమేయమై గోచరించుచున్నది. ఆలోచింప నాఁటి జర్మనుదేశ యువకులలో ప్రజ్ఞాధురీణులు పెక్కురు రణరంగనిహతులగుట యొక దెస నగపడును. హతశేషులయందుఁ గ్రియాలసత్వము బలిసి భావజగద్విహార వ్యామోహము ప్రబలుట ప్రాయికముగ నింకొకదెసఁ గనఁబడును. వీరిలో నుత్తమమైన చిత్తసంస్కృతిఁ గల భావుకులు కొందఱు మాత్రము తమ యుద్ధానుభవములకును, దాత్పర్యములకును రూపరేఖా కల్పనఁ జేయ నుద్యుక్తులైరి. వారి యాత్మకథలే చాలవఱకు నితివృత్తములై ప్రోగుపడినవి. వలన, వారిలో నొక్కొక్కరి నాడియందు యనంతమైన యనుభూతి సంపత్తి కుంభించియున్నది. అవి వారెల్లరుఁ గనులారఁ జూచి యనుభవించిన యుద్ధకాల విషయములలో వానిని వర్ణించుటకై వారికేమియుఁ బ్రత్యేక ప్రేరణశక్తి యక్కఱలేదు; ప్రత్యేక శిల్ప సామర్థ్య సామగ్రితో నక్కఱరాదు. కనులారఁ జూచినదానికి సాక్ష్యమిచ్చుటయే వారు చేయవలసిన పని. అట్లుచేయుట కేవలము మన కొఱకునుఁ గాదు;

---

1 Expressionism

2 Ten years later, it [Expressionism] was [Called] neue Sachlichkeit

తమకు మనోవ్యసన హేతువులగు స్మృతుల యుచ్ఛండ భారమునుండి బలాత్కార విరమణముచే నుపశమన మొందుటకొఱకుఁ గూడ నైయున్నది. సంఘము, ప్రభుత్వ పరిపాలనము [State] కుటుంబ వ్యవస్థ, యార్థిక జీవిత విధానము మున్నగునవి సర్వము నప్పటికే సంపూర్ణముగ మారుట విదిత మయ్యెను. ఇందుఁ దాము నాశన రహితనులమని చాటుకొనుటకో యన్నట్లు కొన్ని పూర్వ వ్యవస్థలు వ్యాప్తిలో లేకపోలేదు. యుద్ధ సంబంధములగు నసంఖ్యాక నవల లానమయమున నే బయల్వెడలినవి. వానిలో యుద్ధమహిమా స్తోత్రములైన నవల లింకను జాలతక్కువ. స్వానుభవము బలీయము గదా! ప్రత్యక్షమును వీడి పరోక్షమును గోరు కాల్పనికమైన యుద్ధసాహస మొక యావేగ మాత్రమే గావున నాత్మానుభూతి ముందు దుర్బలమై పోయినది. ఆ యనుభవమును మానవతా బోధక మగు నంతస్సాక్షి యనవచ్చును. దానిని మానవ నాగరికతా నాశనభీతి యనిగాని, భయానక బీభత్సముల యెడ జుగుప్స యనిగాని యనవచ్చును. నాఁటి నవలలలో నంతశ్శుద్ధియు, నుద్రేకమునుగలవు[1].

సాహిత్య శిల్పపరముగ నున్న గుణముకంటె వాదోపవాదముల కాస్పదమగు రాజకీయస్వభావపరముగ నున్న గుణమే వానియం దధికము. అయినను నందుఁగల యుద్రేకాంతశ్శుద్ధులే ప్రభావవంతములై నాఁటివారి నాకర్షించినవి. ప్రపంచ యుద్ధమునకు సంబంధించిన నిజమగు నితిహాసము రచింపవలెనన్న దృష్టియే యానాఁడు లేదు. అది యుండుటకును వీలు లేదు. దహ్యార్ధ్రివ్యమునకు రూపకల్పన చేయుటెట్లు? శిల్ప ప్రాముఖ్యమునకు సాధన భూములును, వలసరాజ్యస్థాపనా సమస్యల చిత్రణములును, నసఁదగుఁ గొన్ని నవలలు[2] వెలువడినదో వెలువడెనుగాక! అవి జరుగఁగల మహోత్కృష్ట నాటక ప్రదర్శనమునకుఁ గేవలము నాంది ప్రస్తావనలు.

ఆ ప్రదర్శనముజరుగును, జరుగదు. అది దైవమునకెఱుక. కాని నవలలలో రాజకీయ రాద్ధాంత సిద్ధాంతముల మూలమునఁ బ్రజల నుద్రిక్తులఁ

---

[1] Vide, Ludwig Renn's 'War' or Remarque's 'All Quiet on the Western Front.'

[2] Hans Carossa's 'Rumanian Diary' [Secker] was an artistcally important experiment. Hans Grimm's 'A People withouti Space' was a Portrayal of the struggle for a more extensive national area.

జేయు గుణమును బుట్టకయందే వారు చిదిమివేయవలసినది. అది యట్లు జరుగలేదు. అందుచే శిల్పసౌందర్యాతిశయమును వెలార్పఁ గల రచనలు మొగ్గలుగనే త్రుంపఁబడినవి. రాజకీయ జీవితమును భిన్నభిన్న పక్షవాదములును, ప్రత్యేకించి మార్క్సు సిద్ధాంతములును, జేయు దండయాత్రలద్వారమున నవలారంగము నాశనమై శోధితమయ్యెను. ఈ కారణమువలన నీశతాబ్దిపూర్వార్ధము స్వచ్ఛకళాసంపన్నత కనువైనది కాలేదు. కాని, నవలమూలమున మనము లోకవ్యవహారనివేదనము నర్థించుటలేదా? యుగలక్షణముల ప్రతిబింబము నపేక్షించుటలేదా? ఒకజాతిదైన యాంతర బహిర్జీవితపరిణామమునందు జిజ్ఞాసఁ గొనమా? జీవితపరిస్థితులఁ దెలిసికొనఁ గోరమా? భిన్నభిన్న భావసంఘర్షములను, విధివిధానములను బడుగుపేకలుగా గలిపి పాత్రల శీలముల నిర్ణయము సేయుదుముగదా! ఆ నిర్ణయముతో మాత్ర మూరకొందుమా? కొన్నికొన్ని పాత్రలను గొన్నికొన్ని వర్గములుగ విభజించు నంతవఱకుఁ బోవుదుము. కొన్నిటిని సాంకేతిక ప్రతిపత్తికి పీమాభూములుగ నొనరించుటయు జరుగును. జీవితమును గళయుఁ గట్టిపడియుండవలసిన సూత్రములు సిద్ధాంతములు నని కొన్ని యున్నవేని వానిని సాధించు విధానములలో నై విధాన మొక్కటి యనకయుఁ దీరదు.

ఇట్లుండ నవలావిషయమున నొక నూతనకుసుమ సముద్గమము దృగ్గోచరముగాఁ జొచ్చెను. ఈ శతాబ్దిలో మూఁడవ పడియందు యువకులు సాగించిన సమూలబుద్ధి సంస్కారవాదము దెసఁగాఁ జూడ్కులఁ బ్రసరించినపుడీవిషయము ద్యోతకము కాఁగలదు. ఈ వాదము సంప్రదాయ మనుదానిని నుక్కిరిబిక్కిరిగా జేయును. కళాకారుని సాహిత్యవ్యాపారరహస్యములను బట్టబయలొనర్చును; మన మానసిక దిక్ప్రక్రమును మునుఁగువడఁజేయఁగలదు; దృష్టిని వక్రమార్గమునకు ద్రిప్పఁ గలదు. దానితో లోకచిత్రము మన కపార్థముగఁ గోచరించును. చివర కది నైతికబాధ్యతలను గూడఁ బెడత్రోవఁ బట్టించును. ఇట్టి పరిస్థితులు, విరుద్ధభావసంఘర్షములఁ గల్గించి, మనస్సులు కొంకరలుపోవునట్లుఁ జేయును. ఈ తాఁకుదల మనస్తత్త్వశాస్త్రమునకుసోకి తన్మార్గమున లబ్ధప్రతిష్ఠులగు రచయితలనుగూఁడ తాఁకొన్నది. ఇట్లంటుకొనుటతో నవలలయందు మనస్తత్త్వవిషయమును వెలిబెట్టిరి. ధర్మనీతిశీలసంపదల యణువీక్షణమునకుఁగాను మనో బుద్ధిచిత్తాహంకారముల నణువు

నీవిధానమును ద్వేషింపవచ్చుఁగాక! పాత్రలసృష్టికిని సమీకరణము (Synthesis) నకును బాటుపడవలసినరచయితలు దారుణముగఁ దమపాత్రల శల్యపరీక్షకుఁ దామేపాల్పడి యెట్టివారికైన వైకృతముసేయు మనస్తత్త్వ రహస్యముల నిదానమునకుఁ గడఁగి యౌచిత్యమునే పరాభవించుట నిరాకార్యము కాదని యెవరనఁ గలరు?

నవల సాధించిన విషాదభయంకరత్వముల సంపూర్ణతకు మహాజనము విసిగి వేసారిపోయెను. భావుకులింతకుముందే విముఖులై నూత్నవిధానమునకుఁగాను దారులు తెన్నులుఁజూడ సాగిరి. ఆంగ్లేయరచయిత జేమ్స్ జాయస్ (James Joyce) ఫ్రెంచిరచయిత మార్సెల్ ప్రౌస్ట్ మున్నగువారిపై పేరాశలు పెట్టుకొని యుండిరి. క్రీ. శ. 1924 ప్రాంతములో థామస్‌మాన్ రచనము[1] ప్రకటింపఁబడినది. పై యాంగ్లఫ్రెంచిరచయితల ప్రభావము దీనియం దించుకగ నాలోకిత మనవచ్చును. కాని యాప్రభావము మనస్తత్త్వశాస్త్రదృష్టిప్రభావముకంటె నేమంతగ భిన్నమైనది కాదు. అయ్యును జాయస్, ప్రౌస్ట్ ప్రభృతుల రచనలు లేనిచో డాబ్లిన్, హెర్మన్ బ్రోచ్ ప్రముఖుల రచనలు లేవన్నను దప్పురాదు. మొత్తముమీద పాఠకుల యాస లడియాసలైనవి. ఫలన నీనూతన విధానము ప్రకాశించిన ప్రభావముకంటెఁ గల్గించిన కలవరమే యధికము. ఫ్రాయిడ్, ఏడ్లర్, జంగ్ మున్నగువారి విజ్ఞానశాస్త్రజ్ఞానమును కేవలము శిష్యభావముతో సాహిత్యలోకములోనికి దిగుమతి జేయుట, ముల్లుదీసి కొఱ్ఱడచినట్లయినది. వైషయికాంశములన్నియు నత్యాధునికమార్గములయందుఁ దీర్చి దిద్దఁబడి యొక లైంగికశాస్త్రముగా రూపొందింపఁబడిన వనినమాటమాత్రము నిజము. ఇట్టి నవలాసృష్టికిఁ గల మూలహేతువులు, నా రచయితల యుల్లపు మొల్లి మెల్లను దేలికగ బయల్పడిపోవును.

కథావిధానసర్వస్వసారాంశమును, వాస్తవికవర్ణనల నెపఁగుఁ బసయు జీవితచిత్రణపు చేవచెలువమును నాత్మసంవేదనస్వభావసంపన్నిష్టముగఁ బ్రధానీకరింపఁబడెను. ఒక యాత్మనుండి యింకొక యాత్మకు సంవిద్జ్యోతి సంసర్గము కలుగక, యుత్తమ కావ్యకల్పనయే కలుగదు. ప్రసజ్య సన్నివేశ

---

1 "The Magic Mountain" by Thomas Mann [Secker].

2 "Alexander Platz" is the novel of Doblin and "Sleep-Walker" is the novel of Hermann [Secker].

ములే ఘటిల్లవు; మనము పాత్రలమై ప్రతిబింబించు చిత్రమే ప్రసారితము కాదు; ఏ విధి విధాన ప్రసృతియుగూడ మనకు హృదయస్పందనమునుగాని; చిత్త సంక్షోభమునుగాని కల్గింపఁ జాలవు. మనస్తత్త్వవిధానముపై విరక్తిగల్గుట కేవో యగోచరములగు కారణము లుండితీరును. ఒకే ముద్రణాలయమున నచ్చొత్తింపఁ బడినట్లు వెల్వడిన తద్విధములగు రచనల యందాకర్షణ సన్నగిల్లినది. క్రమక్రమముగ నవి నాఁటివారి కానందమును సంధానింపలేక పోఁజొచ్చెను. అవి నీరసములై మనోభావవిశుద్ధివిషయమున నేగాక బుద్ధికిఁ బ్రతిబింబము లన్న విషయమునఁ గూడ విశ్వాసము గల్పింపలేక పోయినవనుట సాహసము కాదు. పలన, నా రచనలు స్వరూపస్వభావములచే మిక్కిలి ప్రాతిస్వికములు. సార్వత్రికమనిగాని, సాముదాయికమనిగాని, సార్వజనీనమనిగాని యీ మానవస్వభావమును మనము సమర్థింపలేము. సంగీతమునుండి మాధుర్యమును బరిష్కరించుటయుఁ, జిత్రలేఖనమునుండి స్థూలవస్తువును బరిత్యజించుటయు వలె నాఁటి నవలలనుండి క్రియాపరిపూర్ణతను విసర్జించుట యొక పరిపాటియై పోయినది. ఒకవిధముగఁ గార్యకారణసంబంధమును, ననుభూతినిఁ బరిత్యజించుటవలన ధోరణిని మార్మిక మనవచ్చును. ఇంకొక విధముగఁ బ్రత్నమైన పద్ధతియందు వైముఖ్యమువలనను, సంప్రదాయమందు బద్ధవిరోధమువలనను, నీధోరణి నొక విశిష్టమైన వివేకాత్మకవాద మనవచ్చును. ప్రతిభావంతుఁడైన యొక రచయితయం దీలక్షణము లన్నియు, విచిత్రముగ సమ్మిళితమైనవి. అతని పేరు ఫ్రాన్జ్ కాఫ్కా [1]. అతని రచనయందు జర్మన్ సాహిత్యోయత యసాధారణమై తొణికిసలాడుచుండు నని స్థూలముగఁ జెప్పవచ్చును.

జర్మనీయువకుఁడైన యీ కాఫ్కా "యూదు" [2] మతస్థుఁడగుట తటస్థించినది. ఈ విషయములనుగూర్చి యిచ్చట మూకీభావము వహింపరాదు పలన, జర్మనీభాషయం దాధునికనవలాకారులు పెక్కండ్రు యూదులగుట గమనార్హము. వారు దేశావధులను దాఁటికూడఁ గీర్తిమోసిరి. [3] వీరిలో జోసెఫ్ రూత్ నవలలు [4] విశేషించి కవితాంశఘటనాపటీయసులు.

---

[1] Franz Cafka.

[2] Jew.

[3] Alfred Doblin, Stefan and Arnold Zweig, Franz Werfel, Max Brod, Lion Fenchtwanger, Hermann Kesten and Josef Roth.

[4] "Job" and "Redetzky March."

యూాదులు సర్వసాధారణముగ బుద్ధివిషయములలో నగ్రగాములై యుండిరి. నవ్యకళామయములును, నవ్యసిద్ధాంతపరములును నగు విషయములకుఁగూడ వీరు చాలవఱకుస్థాపనాచార్యులు. రిచర్డ్ వాగ్నర్[1] నకు జర్మనీలో పూజాపూర్వక సేవాంజలులు ముం దర్పించినది వీరు. తొలుదొల్త నీట్‌చీ[2] యశస్సును సర్వదిక్పరివ్యాప్తము చేసినది వీరు. ఔత్సుక్యపురస్సరమైన వీరి సారస్వతేయాభిరుచియే యీ యర్థశతాబ్దియందు నుత్కృష్ట ప్రబోధనతమ ప్రచురమైనది. ఒక వేయి యేండ్లు నిర్బంధ దాస్యబాధవలనఁ బటురూపములై నెగడిన బుద్ధి శక్తి సామర్థ్యములు వీరియందు కుంభించి యున్నవి. అవి యీ శతాబ్ది మూఁడునాల్గు పదులలోఁ బంచభూతముల ప్రకోపమువలె నుత్క్షిప్తము కాఁ బూనెను. అది యంతయు నొక ప్రమత్తత. దాని పర్యవసానము సాధారణముగ సాంకర్య ప్రాచుర్యము. జాతి జీవనములో భాగస్వామ్యముగల యొక పక్షమువారు చిరకాలము నవకాశములులేక నిరుద్ధావేశులై యుండి ప్రత్యుత్పన్నులగుచున్న కొలఁదియుఁ, గోరుకొన్న దేశమును ప్రేమించువారై, యొకేసారి సామూహికముగఁ గళా సృష్టి క్షేత్రము లోనికి దుమికినపుడు గుంఫితమైయున్న తమ శక్తిసామర్థ్యముల పరువమును, బహుముఖ నైజప్రజ్ఞావిశేషములను వారు బహిర్గత మొనర్ప యత్నించుట వర్ణనకతీతమైనంత సహజము. కావున దానిని చదువరుల యూహాశక్తికే వదలివేయుట సమంజసము.

నానా దేశములలోని సమకాలిక నవలాకర్తలయు నద్యతన నవలాకర్త్రులయు తారతమ్యము నిప్పటికిప్పుడే నిరూపించుట పురిటియందే జాతకము చెప్పుట వంటిది. నేఁటి స్త్రీలలో సామవాద పక్షమునకుఁ జెందిన ప్రాగ్జర్మనీ నవలా రచయిత్రి "అన్నా సేఘర్స్"[3] బహుకీర్తిఁ గన్నదన్నఁ జాలును. ఎందుఁగాని యపరిమితమైన యుత్పత్తి జరుగునపుడు దాని విశ్లేషన మెంత యావశ్యకమో యంత కష్టసాధ్యము; నంత నిష్ఠురము. అందుచే నిందు నవలా క్షేత్రవీధి సూచనలు దిఙ్మాత్రముగ సూచింపంబడినవి.

---

[1] Richard Wagner.

[2] Nietzsche was a well-known thinker of Germany.

[3] Her famous novel is 'The Dead stay Young'
(దీని యనువాదము "మరణించినవారింకను యువకులే")

ప్రస్తుతమునకు జర్మన్ నవలను ఘనకార్యసాధనాభిధాయిక మనలేము. ఆ జాడలు చూపుమేరలో లేవు. కాని బౌద్ధిక సాంఘిక పరిశుద్ధికి దారి తీయు సాముదాయిక కృషి కొంత చూచాయగ గోచరించుచున్నది. అది సమాజ వికాసమునకును, నూత్నసంప్రదాయ నిర్మాణమునకును బాసటయై నిల్చి దేశమును వీని కభిముఖ మొనర్చి యున్మ్రద్రముగఁ జేయఁ గలదు. ఇట్టిది కళారాధన తత్వవిరుద్ధమును, శిల్పధర్మవ్యపేతమును నగుఁగాక! ఆత్మబుద్ధికృత పాత్ర పోషణ విధానము క్షీణించి యిందువలన వ్యపదేశ విధాన మేర్పడవచ్చుఁగాక! వైయుక్తికవిధానము కార్యకారిగాక, నిష్ఫలమై యూరపుఖండ వినాశమునకై ప్రకోష్ఠ గేహాళీపర్యంతవ్యాప్తమైనప్పు డీ సమష్టి మార్గముగాక యే యితర మార్గము సముద్ధరింపఁ గలదు?



# ఏరు దాటిస్తా

—శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

ఏరు దాటిస్తానె చిన్నదానా! నా
కేమిస్తువె సాహసమున్న దానా!

'కో' యని ఒక పిలుపేనా,
తీయని ఒక పలుకేనా,
చాలునులే, నేటి, కంత
చనుమానము లిస్తివంటె.
ఏరు దా......

ఒరిగెనులే సందె ప్రొద్దు;
పరదహోరు భయము వద్దు—
సూపుమేర దూరములో
ఆపదరెవ రిద్దరమే
ఏరు దా.......

బిల్లకట్టు మూసిపెట్టి
పడకే సిందులే సరంగు,
అవునను మొక సిటికలోన
అద్దరి జేరుస్తానిక.
ఏరు దా......

తుళ్లింతల ఏటినీటి
తుంపరయిన సోకనివను;

సెదర నను కవుగిట నీ
సిగ పూ గమ గమ్మైనా
ఏరు దా.......

కోరడి మలుపున లేదూ
కూచున్నా తోట మాలి;
ఎల్లేసిన మైలురాయి
ఎందుకు నీకంత బెదురు
ఏరు దా......

చిరునవ్వులు చెదరకుండ,
సిగ్గుపొరలు చీలకుండ,
తేలిక ముద్దొకటీవే
వాలుకనుల వగలాడీ
ఏరు దా......

మాటిస్తా నీ సొరికి
మోట సరస మాడనులే,
ఒంటరి నీ మనసు గుట్టు
ఊరక మోగిస్తు నంతె
ఏరు దా......



కథానిక :

# ఆదర్శం

—శ్రీ యం. హీరాలాల్ రాయ్

శంకరం ఆలోచిస్తూ ఇంట్లోంచి బయల్దేరాడు. దోవలో కలసిన మిత్రులంతో అదీ యిదీ మాట్లాడుతూ 'గాంధీచౌక్' వరకూ వచ్చి, అక్కడి విశ్రాంతి ప్రదేశంలో కూర్చున్నాడు.

యెప్పుడూ యేదో ఆలోచిస్తూ వుండే శంకరాన్ని గురించి రమేశ్ తను ఆలోచించడం మొదలెట్టాడు. అతనికి శంకరం యెన్నడూ అర్థం కాలేదు. అతనొక్కడి కేవిటి, అతని మిత్రు లెవ్వరూ అర్థం చేసుకోలేరు.

శంకరం సంపన్న కుటుంబంలో జన్మించాడు. దాదాపు ముప్పై సంవత్సరాల వయస్సుంటుంది. వాళ్లది నిజమైన వృత్తి వ్యాపారం అయినప్పటికీ, అతని పినతండ్రీ, మిగతా బంధువు లందరికీ రాజకీయాలతో ఘనిష్ఠ సంబంధాలుండడం, సాంఘిక సేవా కార్యక్రమాల్లో ఉత్సాహంతో పాల్గొంటూ వుండడం వల్ల, శంకరాని క్కూడా చిన్నతనం నుంచే యీగాలి సోకింది. జీవితం మీద సోకిన ప్రభావం తప్పించుకోవడానికి యిష్టం లేక, అలానే క్రమంగా, సాంఘిక రాజకీయ కార్యక్రమాల్లో చేతనైనంత నిస్వార్థంగా పాల్గొంటూ, చివరికి జిల్లా అంతటా ప్రఖ్యాతి వహించాడు. ఈ యుగపు రాజకీయ వేత్తలూ, నాయకులూ, కార్యకర్తలలో సహజంగా వుండే లక్షణాలు శంకరంలో ఒక్కటి కూడా మచ్చుకి కనపడవు. అబద్ధాలు మాట్లాడి, అక్రమాలు జరిపి, జనాన్ని మోసం చేసి, నాయకత్వాన్ని వెలిగించుకోవడం అతనికి బొత్తిగా సరిపడదు. ఒక సమస్యకి, పరిష్కారం అర్థిస్తూ ఎవరైనా వస్తే, దాన్ని మరీ జటిలం చేసి, అక్రమ లాభం పొందడం అతనికి తెలీదు. న్యాయంగా ముక్కుసూటిగా వెళ్లే రకం.

శంకరాన్ని గూర్చి మౌనంగా ఆలోచించే రమేశ్‌ని కదిలిస్తూ "మిత్రమా! ఏదో ఆలోచిస్తూన్నావూ? ఏదన్నా తుపాను రావడం లేదు కద?" అన్నాడు విశ్వేశ్వరరావు—

వెంటనే మరో మిత్రుడు రవూఫ్ అందుకుని "శంకరం పోలిక వచ్చిందేమో?" అన్నాడు ఛలోక్తిగా.

"అలానే ఆలోచించకు నాశనం అవుతావు" అన్నాడు ప్రహ్లాదరావు.

"ఏం శంకరంలా ఆలోచించడం ఆత్మ వినాశన హేతువా యేమిటి?" అన్నాడు రవూఫ్ పెద్దగా నవ్వుతూ తెచ్చి పెట్టుకున్న ఆశ్చర్యంతో.

"కాక మరేమిటి?" మధ్యలోనే అందుకుంటూ అన్నాడు రవి. "శంకరానికి బాగా చదువుకున్న జనంలోనూ, అధికారుల్లోనూ మంచి పలుకుబడి

వుందన్న సంగతి తెలియంది కాదు. అయినప్పటికీ యీ పలుకుబడి అతని బాగు కోసరం ఉపయోగించడం లేదు. ప్రజల సమస్యల పరిష్కారం సందర్భంలో నిద్రాహారాలు మాని కృషి చేస్తాడు. ప్రాణ స్నేహితులైన అధికారులన్నా లక్ష్య పెట్టడు. యీ నిష్కల్మషత్వం, ఆదర్శ సాధనలే ప్రస్తుతం కొందరి దృష్టిలో నేరాలు. ఐతే, సామాన్య ప్రజల్లో శంకరం పలుకుబడి పెరుగుతూండడానికి యివే కారణాలు కొంత మంచి – కొంత చెడు." అంటూ నిట్టూర్చాడు.

రవూఫ్ యీమారు మరింత పెద్దగా నవ్వుతూ "ఇలాంటి పలుకుబడిని, స్వార్థపరులు అవసరం అనుకున్నప్పుడు క్షణంలో ధ్వంసం చేసి వదలి పెడతారు. ఇలాంటి శంకరాలు వేల మంది కూడా ఇవాళ వాళ్ల బారినుండి బయటపడలేరు. వాళ్లకున్న డబ్బూ, దస్కం ప్రభావంతో రాజకీయ రంగాన్ని కూడా ఆక్రమించుకున్నారు. దీంతో రాజకీయాల స్వరూపమే మారి పోయింది" అన్నాడు.

"అవును నిజమే. కాని, శంకరం అలాంటి వాటిని లక్ష్యపెట్టడు. అతని జీవిత పురోగమనం ప్రశంసించదగ్గది" అన్నాడు రవి.

"కాబట్టే ఆయన యెప్పుడూ ప్రమాదాల అంచుననే ప్రయాణం చేయవలసి వస్తుంది. ఈ కృషి ఫలితం, ధనవంతులు వినియోగించుకొని క్షేమంగా సుఖపడుతూంటారు" అన్నాడు రవూఫ్.

అప్పటి వరకూ మౌనంగా వున్న 'శంకరం' తనని గురించి మిత్రుల వ్యాఖ్యానాలు విని మెల్లిగా నోరు విప్పి "అందరినీ ఆశ్రయించడం, అనవసర ముఖస్తుతులు జరపడం నాకు రాదు. ఇది నా దురదృష్ట మేమో? యేం చేద్దాం? ఐనా నాకు నెరవేరవలసిన స్వార్థం అంటూ యేమీ లేదు" అని లేచాడు. శంకరంతో పాటే అంతా మౌనంగా లేచారు. కాస్సేపలాగే నిలబడి, గాంధీచౌక్ నుండి తలా ఒక దోవ పట్టారు.

రాజకీయ రంగంలో యెన్నో పరిణామాలు సంభవించాయి. కాని శంకరం వ్యవహారంలో మాత్రం యే మార్పు రాలేదు. జీవితంలోని సూక్ష్మాతి సూక్ష్మాంశాలూ, సున్నిత వ్యవహారాలను గురించికూడా అతనికి హేతుబద్ధమైన ఆలోచనే. రాజకీయాలు స్వయంగా కల్మషాత్మకమైనవి కావనీ అవి కల్మషం చేయబడుతూన్నాయనీ అతని వాదన. ప్రజా సమస్యలు వేదనలని పరిష్కరించడానికి రాజకీయాలు చక్కని సాధనాలుగా ఉపకరిస్తాయని అతని విశ్వాసం. స్వార్థపరుల మూలంగానే రాజకీయ పదానికి ముందు 'దుర్గంధ' అనే పదం జొరబడిందనీ, ఇలాంటి వారిని రాజకీయ క్షేత్రం నుంచి తరిమి వేయడానికి అంతా కృషి చేయాలని వాదిస్తాడు. కార్యకర్తలలో బలహీనతే సంస్థల బలహీనతకీ వినాశనానికీ ప్రోద్బల మవుతుందంటాడు.

శంకరం వివాహమై కొద్ది సంవత్సరాలే అయింది. శంకరం భార్య 'శాంతం' చదువు సంధ్యలు నేర్చిన యువతి. పెళ్ళికి పూర్వం ఆవిడ పెట్టుకున్న ఆశలూ,

కన్న కలల్లో, శంకరాన్ని పెళ్లి చేసుకోవడంతో ఒక్కటీ పూర్తికాలేదు. తన భర్త చాలా 'అప్టుడేట్'గా, 'మాడరేట్'గా మంచి మంచి ఖరీదైన సూట్లలోనే యెప్పుడూ వుండాలి. యింట్లో యినప్పెట్టెలోకి ధారాపాతంగా డబ్బు ప్రవహిస్తు రావాలి. తనూ తన భర్తా, మోటార్లలో షికార్ చేస్తు జాలీగా వుండాలి. ఇవీ కాంతం ఆశలూ, కలలూ.

కాంతం ధనవంతుల యింటిపిల్ల. అవిడ పుట్టిం దగ్గరనుంచీ, తనతో సమానంగా డబ్బుని ప్రేమిస్తూ పెరిగింది. యింకా ధనవంతుల యింటివాంఛ లెన్నో ఆవిడకి స్వయంగా అబ్బినై. కాని, అత్తారింటికి రావడంతో అవన్నీ మనస్సులో ఒక్కొక్కటే అణగారి పోసాగాయి. యిక్కడ కాంతానికంతా కొత్త వాతావరణం, చిత్రమైన అలవాట్లూ, విచిత్రమైన అభిప్రాయాలే కనిపించాయి. విచిత్రమైన జీవితం గడుపవలసి వచ్చింది. వచ్చిన కొత్తరోజులలో, తనను కున్నట్టుగా భర్తని మార్చి, కోరికల జీవితం గడపడానికి చాలా యత్నించి సతమతమైంది. కాని; శంకరం నిరాడంబర జీవితం ముందు ఆవిడ యత్నాలు శిరస్సు వంచి, మౌనంగా వుండిపోక తప్పలేదు. శంకరాన్ని మార్చడం రాతిని కరగించడానికి ప్రయత్నించడమేనని అనుభవ పూర్వకంగా కాంతం గ్రహించడాని కెంతో కాలం పట్టలేదు. మిగతా విషయాలలో యెన్నో మంచి లక్షణాలు ఆవిడ కనిపెట్టింది. అతను క్షణం కనిపించందే ఆవిడకి తోచదు. ఆవిడ కోరికలు అసాధారణమైనవని ఉపేక్షించ బడుతూన్నప్పటికీ, ఆవిడకి భర్త పట్ల ఉపేక్షా భావం కలుగలేదు. కాంతం అనుకూలవతియైన ఇల్లాలుగా శంకరానికి నచ్చింది. ఆవిడ అవసరాలని పూర్తి చేయడంతో అతను చాలా శ్రద్ధ కనబరుస్తూం డేవాడు. శంకరం బహిరంగ జీవితంలో అతని ఉనికికి సంబంధించిన జీవితంలో అతని ఉనికికి సంబంధించిన విషయంలోనే ఇద్దరి అభిప్రాయాలూ కలవడం లేదు. కాని మిగతావన్నీ సరిపెట్టుకోవడానికి అట్టే కష్టం కలుగలేదు. సంసార జీవితంలో యెలాంటి తుపానులూ రాలేదు.

యెప్పుడూ, అన్నివిషయాలలోనూ నిరాడంబరత్వమే కనపడే జీవితం, కాంతానికి ఒక్కొక్కసారి నిస్సారం అనిపించి కొద్దివిసుగు పుట్టిస్తుంది. ఆవిడ అవసరాలన్నీ కొరతలేకుండా నెరవేరు తుంటాయికాని, అందులో ఘరానా తనం, ఆడంబరంమాత్రంగోచరించవు విసుగెత్తినప్పుడల్లా భర్తతో అంటుంది, 'మీ రెప్పుడూ తీరికలేని కార్యనిర్వాహకులే. పొద్దస్తమానం యేదోఒక పనే. సభలూ, సమావేశాలూ, పర్యటనలూ, ఇదేవరస. అస్తమానం యిల్లంతా తిరునాళ్ల. ఇంటిలో భార్య వుందన్న సంగతి కూడా మీరు కొంచెం గుర్తుంచుకోవాలి. యిరుగు పొరుగు స్త్రీలూ, వాళ్లభర్తల వ్యవహారం చూస్తే నా దురదృష్టానికి అప్పుడప్పుడు యేడుపొస్తుంటుంది. రాందయాల్ సేటుని చూడండి, ఆయనెప్పుడూ భార్య లేందే షికారు కెళ్లడు, రావుసాహేబ్ గోపీనాథ్ గారింటిలో యెంతోదర్జాగా

వుంటారు. యేమిటీ మార్పులేని బ్రతుకు? చెప్పండి! పనిలేకగాని యెందుకీ సేవలూ, రాజకీయాలూ?'

అప్పుడప్పుడు ఆవిడకు వచ్చే ఆవేశం శంకరానికి తెలుసు. ఆవిణ్ణి సాంతం మాటలాడనిచ్చి, శంకరం ప్రశాంతంగా తన వాదన వినిపిస్తాడు. "మానవ హృదయంలో కరుణ, సేవాభావం లేకుంటే, మనం నేడీ స్థితిలో వుండేవాళ్లం కాదు. మానవ సమాజ జీవితాన్ని సుఖవంతంగా మలచడానికి యిప్పటి కెంతోమంది తమ ఆత్మలను అర్పించారు. నేను బాధ్యతను నిర్వహిస్తున్నానేగాని ఎవరిని సేవించడం లేదు. నన్నూ, నాకార్యక్రమాలనీ, విశాల హృదయంతో నిజంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు కాంతం! జీవితంలో కొన్ని సూత్రాలనూ నియమాలనూ యేర్పాటు చేసుకొన్నాను. వాటికి సంపూర్ణంగా అలవాటు పడిపోయాను. వీటిని విసర్జిస్తే నాకు సుఖశాంతులు దూరమవుతాయి. అలాంటి స్థితిలో నేను ఇప్పుడు నీకు చేకూరుస్తున్నపాటి సుఖం కూడా చేకూర్చలేను. ఇప్పుడు నీకు తక్కువైంది యేమిటీ? నిన్నెప్పుడూ నేను కష్టపెట్టలేదు. కృత్రిమ జీవితం గడపాలనే నీవెప్పుడూ ఆలోచిస్తుంటావు. కట్టుకోవడానికి బతచీరెలు లేనివాళ్లని గురించి, ఒక్కపూట కూడా కడుపు నిండా తిండికి నోచుకోని వాళ్లని గురించి ఆలోచించు. నీవు రోజూ చీరెలు మారుస్తుంటావు. రకరకాల మృష్టాన్నం ఆరగించుతూంటావు. నీకు లోటేమిటి? నీవంటే నాకెంత అనురాగమో నీకే తెలుసు. మరి యిన్ని సౌకర్యా లున్నప్పటికీ యీ జీవితం నీకు విసుగెత్తిస్తుందంటే అది నీ అతిశయ వాంఛవల్ల కలుగుతున్నదే కాని మరేమీ కాదు. ఇదంతా అతి ప్రశాంత స్వరంతో వినిపించి మౌనం వహిస్తాడు శంకరం.

ఒకోసమయంలో ఈవాదం కాంతానికి తృప్తికల్పించదు. సభ్యతా మర్యాదలకి దూరం కానిదశలోనే మంకుపట్టు పడుతుంది. ఇక అలాంటి సమయం లోనే శంకరం మంకుగానే బండ సమాధానం ఇస్తాడు. 'గృహజీవితం ఇలాసాగించడం నీకు ఆనందంగా లేకపోతే, గృహమర్యాద, సభ్యతకి విరుద్ధం కానంత వరకు నీకు ఆనందం కలిగించే మంచిపని మరేదన్నా కల్పించుకోవడానికి నీకు స్వాతంత్ర్యం వుంది. అలా చేయటం నీకిష్టం లేకుంటే, ఆ బరువును కూడా నేనే సంతోషంగా స్వీకరిస్తాను. ఏది కావాలన్నా చదువుకోవడానికి లైబ్రరీవుంది, వార్తా పత్రికలున్నాయి. నీవుకూడా జీవితంలో కొన్ని నియమ నిబంధనలను యేర్పాటు చేసుకో. సహనం, ఆభిజాత్యం, జీవకారుణ్యం, అలవరుచుకుంటే బ్రతుకు భారం అనిపించదు ఇలా చీకాకు పడె ఆవసరం కలగదు. ఏసంగతినైనా సక్రమ పద్ధతిలో గ్రహించడం అలవర్చుకోవాలి. మనం విలాసంగా బ్రతకడం కోసం, మంది జేబులు కత్తిరించడం నాకు అసహ్యం. వేలాది ప్రజలకోసం కొద్ది హృదయ బాధ అనుభవించడంవల్ల ఆత్మానందం కలుగుతుంది. నీవుకూడా రోజూ కాస్సేపు అందరి కష్టనిష్టురాల గురించి ఆలోచించడంలో అభ్యంతర మేమిటి? యిప్పుడు

పాగే నీ ఆలోచనా పద్ధతితో నాకు అన్యాయం జరుగుతోంది. అర్థంలేకుండా ఆడంబరాన్ని పట్టుక ప్రాకులాడ్డం అంతగా తెలివైన పనికాదు.'' యీ ఉపన్యాసంతో 'కాంతం' కంపించి పోతుంది. అవకాశం కోల్పోయి, మౌనవ్రతంలో పడిపోతుంది.

శంకరం ఇంటిలో పనిచేయడానికి ఓ 'పనిమనిషి' వుంది. ఆవిడ నిజంగా అందగత్తె. యౌవనవతి అంతేగాక మర్యాదస్తురాలు కూడను. శంకరం తత్వం ఆవిడకు బాగా పరిచయం. శంకరం యజమానికి తగిన ఆహంకారం ప్రదర్శించకుండ కలుపుగోరుతో ప్రవర్తిస్తాడు ఆమెతో.

అందమైన పనిమనిషితో భర్త అలా చనువుగా వర్తించడం, మాటలాడ్డం కాంతానికి నచ్చదు. ఆవిడ హృదయంలో అకారణంగా అనుమానం ప్రజ్వరిల్లింది. అది బాగా రగులుకొంది. ఒకనాడు శంకరంతో చెప్పకనే ఏదో సాకుతో ఆవిణ్ణి పనిలోంచి తొలగించి, ఆ స్థలంలో మరో ముసలిదాన్ని పనిమనిషిగా నియమించింది. ఈ చిన్న వ్యవహారం శంకరం అసలు పట్టించుకోనే లేదు. కాని గమనించకుండ వుండలేదు.

అలా రెండు మూడు నెలలు గడిచాయో లేదో, ముసలిదాని తత్వం మారిపోయి, సహజ తత్వం ప్రకోపించింది. అది శంకరాన్ని, అతని ఉనికిని సరిగా అంచనా వేయలేక, అతన్నో రసికుడుగా అర్థంచేసుకొని, లోగడ సాగించి వదలిన తార్పుడు వృత్తి తిరిగి ప్రారంభించాలని నిశ్చయించింది. క్రమక్రమంగా శంకరం ముందర, ఫలానా అమ్మాయి చాలాఅందమైందని చెప్పడం, ఫలానా యువతి అతనంటే పడిచస్తోందని కబురందించడం, ఇత్యాదులు సాగించింది. ముసలిదాని వ్యవహారం సంపూర్ణంగా అంతుచూడాలన్న అభిలాష శంకరానికి కలిగింది. అసలీ ముసలిదాన్ని పనిలో పెట్టుకోవడం శంకరం యిష్టంతో జరిగిందికాదు. అంతా కాంతం యిష్టంమీదే జరిగింది. భర్తలు యెంత విశ్వాస పాత్రమైన జీవితం గడుపుతూ వున్నప్పటికీ, భార్యలు వారిమీద ఒక చూపువుంచి పరిశీలిస్తునే వుందురు. యేదేశంలో, యేభూమిలో నైనా స్త్రీలకి యిలాంటి అలవాటు సహజంగానే వుంటుంది. యెంతో చదువూ, సభ్యత, ఉన్నత సంస్కారం గల స్త్రీలోకూడ, సహజంగా కొంచమైనా అనుమానించే దృష్టివుండి తీరుతుంది.

అవతల వీధిలో 'నిర్మల' అనే ఓ అందమైన అమ్మాయి యింటి సమీపంలోనే ఈ ముసలిదాని యిల్లుంది. నిర్మల తండ్రి రెండేళ్ల క్రితమే చనిపోయాడు. పెళ్లయిం తరవాత తల్లి చెల్లుకుంది. దురదృష్టం ఆవిణ్ణి వెన్నాడిందో యేమో మూడునెలలకే తీవ్రవ్యాధితో భర్త మరణించాడు. అసలు, పెళ్లికావడమే కష్టమైనదశలో, ఒక పేద యువకుడితో పెళ్లయింది. అతడు మరణించడంతో ఆవిడ సంపూర్ణంగా నిరాధారురాలై పోయింది. యేదో కొద్దిపాటి చరాస్తి వుంటే అది భర్త జబ్బులో మందులూ, డాక్టర్లకే హరించుకు పోయింది. చివరికి

జీవితం మీద విసుగెత్తి, అతిభయంకరమైన మార్గంలో ప్రయాణించడానికి నిర్మల సిద్ధమైంది. ఆవిడ యిలా నిశ్చయానికి రావడంలో యీ ముసలిదాని పాత్ర చాలావుంది. నిర్మలని అడ్డంపెట్టుకొని డబ్బు సంపాదించాలమన్న దురాశ ముసలిదానికి కలిగింది. పేరుకు అక్కడక్కడా యిళ్లలో పని చేస్తుంటుంది కాని, దానికి జీవనాధారం తార్పుడు వృత్తిలోనే లభిస్తుంది. దాని జీవితంలో ఇలాంటి ప్రేరేపణలద్వారా ఎంతమంది యువతుల్ని పెడమార్గం పట్టించిందో, యెన్ని సంసారాలు విడిపోవుటకు పరోక్షంగా కారణభూతురాలైందో దానికే తెలుసు. తను పనిచేసే యిండ్లలో, ధనానికి, యవ్వనానికి, సౌందర్యానికి, లోబడే యువతులని కానీ, యువకులని కానీ కనిపెట్టడం దాని నిత్యకృత్యం. నిర్మల ముసలిదాని వలలో పడింది. దాని యిచ్చానుసారం శంకరానికి సౌందర్య సందేశాన్ని పంపింది. 'నిర్మల' సౌందర్యంగురించి శంకరం విన్నాడు. కాని ఆవిణ్ణి చూడడం తటస్థించలేదు. ఆవిడ చనిపోయిన భర్తమూలంగా శంకరానికి బాగా పరిచితుడు నిర్మల సందేశం అతని హృదయంలో అశాంతిని రేకెత్తించింది. దీనికి విరుగుడు వెదకడం మొదలు పెట్టాడు.

నిర్మల శంకరం మధ్యన సమావేశాలు ప్రారంభమయాయి. చాలా జాగ్రత్తగా నిర్మల బారినుండి తనని రక్షించుకుంటూ వస్తూన్నాడు శంకరం. ఇలా మాసాలు గడిచి పోతున్నాయి. ఆవిడకి చేతనైన సహాయం శంకరం చేస్తోంటే, ఆవిడ హృదయం కృతజ్ఞతతో నిండిపోతోంది అతి ముఖ్యమైన విషయాలు కొన్ని మాట్లాడాలనే ఉద్దేశ్యంతో ఒకనాటి రాత్రి సమయంలో శంకరం నిర్మల యింటికి వచ్చాడు. తలవనితలంపుగా జరిగిన శంకరం రాకడ, అర్ధరాత్రి, ఒంటరితనం, ఆవిడ శరీరం అకస్మాత్తుగా విద్యుత్తు ప్రసరించినట్టయింది. యెందుకో చలి కుదుపుతున్నట్లుగా బాధపడి, విశాలమయిన శంకరం కౌగిటిలో ఒదిగి పోవాలన్న వాంఛ ఆవిడకు కలిగింది. కొద్దిపాటి నిగ్రహం ప్రదర్శించుచూనిర్మల యిలాఅంది. 'అంతు లేకుండ సాగుతున్న మీ ఉపకార, సహకారాలతో నా హృదయం నిండిపోయింది. నా సర్వస్వం మీకు అర్పించుటకు సిద్ధంగా వున్నాను. మీయిష్టంవచ్చినట్లు నన్ను ఉపయోగించు కోవచ్చు." అని ముందుకు వచ్చింది ఆవేశంతో.

శంకరం కొంచెం వెనక్కి జరుగుతూ ఆందోళన ప్రస్ఫుటించే స్వరంతో "నిర్మలా! నా ఉపకారం, నీ కృతజ్ఞత విషయాలలో నాకాట్టే నమ్మకం లేదు. నిన్ను నేను హృదయపూర్వకంగా మన్నించి గౌరవించుచున్నాను. నేను నెరవేరుస్తున్న మానవ సహజమైన బాధ్యతకి 'ఉపకారం' అనే పేరు తగిలించి, కృతజ్ఞతా రూపంలో, స్త్రీలకి అమూల్యాలంకారమైనదీ, అతి విలువగలదీ అయిన దానిని నా స్వాధీనం చేస్తానంటూన్నావు. నీ త్యాగం విలువ నాకు సంపూర్ణంగా తెలుసు. ఇలాంటి అమూల్యమైన ఒక నిక్షేపానికి స్వయంగా నేనధికారిని. కావాలంటే ప్రతిరోజూ నేను ఆనిక్షేపాన్ని అనుభవించగలను. నీలో యేప్రత్యే

కతవుందనిఇలా సాహసించు చున్నావో అర్థంకావటం లేదు'' అన్నాడు. శంకరం ఈ మాటలు చాలా సరళంగా అన్నాడు. అతని ప్రతి మాటలో చాలా చనువూ, కలుపుగోలుతనం పెల్లుబికినట్లుగా వుంది. ఈ మాటలతో నిర్మల శరీరం చెమట పట్టి తడిచి పోయింది. ఆవిడ శిరస్సు సిగ్గుతో క్రిందికి దిగిపోయింది. "క్షమించండి మిమ్మల్ని చాలా పొరపాటుగా అర్థం చేసుకున్నాను. కాని, నిజంగా నా హృదయం కృతజ్ఞతా భారంతో అణగి పోతోంది'' అన్నది నమ్రతగా వెనకకు జరుగుతూ.

శంకరం పలుకకుండ మౌనంగా ఆవిడ మాటల్ని పరిశీలిస్తున్నాడు. "ఈ ఉపకారం నాజన్మలో మరచిపోలేను. నా జీవితాన్ని మీరు కోరిన పద్ధతిలో మలచి, నన్ను మార్చివేసే అధికారం మీకు వుంది'' అంది చేతులు జోడించి. శంకరం అవునన్నట్లు తలూపి బయట పడినాడు. యెన్నాళ్ల తరబడిగానో మోస్తున్న భారం వదలి నట్లయిందతనికి.

మరో నెల రోజుల్లో నిర్మల వివాహం, ఒక ప్రముఖ చిత్రకారుడితో అతి వైభవంగా జరిగి పోయింది. శంకరం ప్రోద్బలంతో వివాహానికి సమ్మతించిన చిత్రకారుడు, అందమైన నిర్మల రూపం యే చిత్రానికీ తీసిపోదన్న సంతోషంతో పొంగి పోయాడు.

ఇంతటికీ కారణమయిన ఆ ముసలి మనిషి ఇంకా శంకరం ఇంటిలో పని లోనేవుంది. శంకరానికి దాని సహజ తత్వం తెలిసింది, కాని వెళ్లగొట్టడం తన బాధ్యతగా అతనెప్పుడూ పెట్టుకోలేదు. క్రమంగా దాని వునికినే మరిచి పోయా న్నాడు. ముసల్ది మాత్రం 'కాంతం' మనస్సులో దురూహాలు ప్రేరేపించి ఎలాగైనా ఆవిడ సౌందర్యాన్ని మరొకరి అనుభవాని కందించి, నాలుగు రాళ్లు సంపాదించుకునే అవకాశం దొరకదా? అని ప్రయత్నాలు పుష్కలంగా సాగి స్తోంది. 'కాంతం' కూడ మామూలు అందగత్తె కాదు. పచ్చని పసిడి శరీరం పల్చని పెదవులూ,తామర పూలలాంటి కళ్ళూ, అప్సరసలా వుంటుంది. ఆవిణ్ణి ఒకసారి చూచిన ప్రతీవారూ మరచిపోలేరు. అంతేకాక, ప్రజా రాజకీయ రంగంలో పనిచేసే ప్రముఖ కార్యకర్తల భార్యలూ, చెల్లెళ్లూ అంటే యెందుకో పడిచచ్చేవారి సంఖ్యకూడ యెప్పుడూ అపరమితంగానే వుంటుంది. ఈ సంఖ్యలో చాలామంది, వాళ్లకోసం ప్రయత్నించి అక్రమలాభం పొందుటకు సిద్ధంగా వుంటారు. అలా యత్నించి సఫలం అయితే ఒక సామ్రాజ్యాన్ని జయించినంత సంతృప్తి వాళ్ళకి లభిస్తుంది. అంత పేరుగల యింటిని కూడ కలుషితం చేశామన్న సంతోషం వాళ్ళకు కొత్త విశ్వాసాన్ని కలిగిస్తుంది. అతిప్రమాద స్థాయిలోకి చేరిన యీ విచిత్ర మనస్తత్వం శంకరానికి బాగా పరిచయమే.

ఆనాడేదో పనివుండి శంకరం కొంచెం ఆలస్యంగా రాత్రిపూట యింటికి చేరుకున్నాడు. యింటిలో ఒక చిత్రమయిన సంఘటన అతని కళ్లకు కనిపించింది.

ముసలి దాన్ని ఒక స్తంభానికి తాడుతో బలంగా బిగించి, రెక్కలుకట్టి, శిక్షవేసిన దానిలా ఉగ్రురాలై, కొరడా ఝుళిపిస్తూ, యిష్టం వచ్చినట్లు పశువును బాదినట్లుగా కాంతం యెడాపెడా బాదేస్తున్నది. ముసలి దానికి స్పృహ తప్పుతున్నట్లున్నది, నోట్లోంచి. ముక్కుల్లోంచి రక్తం వచ్చేస్తుంది. ఈ దృశ్యాన్ని శంకరం భరించలేక పోయాడు. ఆవిడ చేతిలోంచి అమాంతంగా కొరడ లాగి విసరి పారేసి "మనిషివా, పశువ్వా? యెందుకలా కొడుతున్నావ్? చావదూ?" అన్నాడు తీక్షణ స్వరంతో

కాంతం భర్తనొకసారితీక్షణంగా చూసి, డ్రాయరు దగ్గఱికెళ్లి అందులోంచి, ఒక ఉత్తరాన్నీ, ఐదువందల రూపాయి నోట్లకట్టనీ తీసి శంకరం చేతికి ఇస్తూ "చూడండి! దీని సాహసం యే దశకు వచ్చిందో?" ఉత్తరం చదివాక శంకరానికి అంతులేని ఆశ్చర్యం కలిగింది.

వుత్తరంలో యిలా వుంది.

"అపరమితమైన మీ సౌందర్యాన్ని ఆరాధించే వాళ్ళలో నేను ప్రథముణ్ణి. సంవత్సరాల తరబడిగా మీ సంయోగార్థం తపించి పోతున్నాను. నా జీవితాశయం, సర్వస్వం మీరేననడం అతిశయోక్తి కాదు. ఒక్కసారి మీ లేత పాదాలపై స్థానం కల్పించుకోవాలని వుంది. మీరు యిద్విధమైన బదనాం పాలు గాకుండా రక్షించే బాధ్యత నాది. అనుమతి లభిస్తే, నేటిరాత్రి రెండుగంటల సమయంలో దొడ్డిదర్వాజా గుండా మీ సన్నిధికి చేరుకుంటాను. మిగతా విషయాలు సమక్షంలో —"

మీ 'రవి.'

ఆశ్చర్యంతో శంకరం నిలువునా కోపంతో మండి పోయాడు. ముసలిదాన్ని ఈ చెతో పొడిచి ఒల్లెడలా చేయాలన్నంత కసికలిగింది. ఇలా ఉత్తరం రాసిన మర్యాదస్తుడైన ఆ పెద్ద మనిషిని రివాల్వర్ గుండ్లతో పేల్చేయా లనిపించింది. హృదయం దహించుక పోయింది. కాని కొంచెం సేపట్లో అతని క్రోధం దిగి పోయింది. తన కోపానికీ, అవివశత్వానికీ తానే సిగ్గుపడి, ప్రశాంతంగా ఆలోచించాడు. చిరునవ్వుతో కలం, కాగితం అందుకుని మళ్లీ ఉత్తరం రాశాడు

"ప్రియ మిత్రమా"

"అతిబలీయమైన మీవాంఛను, ఉద్రేకాన్ని సానుభూతితో గ్రహించాను. ఈ కోరికతో మీ జీవితాశయం నెరవేరేపక్షంలో, అది తీర్చడానికి నాశాయశక్తులా ప్రయత్నిస్తాను. దొడ్డిదర్వాజా గుండా రావడమేంఖర్మ? బహిరంగంగా ఇంటిముందు ద్వారంగుండానే రావచ్చు మీకెలాంటి యిబ్బందీ వుండదు."

మీ 'శంకరం'

ముసిలిదాని కట్లువిప్పి, కొంచెం సేవ తీర్చిన తర్వాతగాని అది ఎప్పటిస్థితికి రాలేదు. శంకరం తాను వ్రాసిన వుత్తరాన్ని దానికిచ్చి, "దీన్ని రవీంద్రంగారికి

అందించాలి" అంటూ ఒక అయిదు రూపాయల నోటు చేతిలో పెట్టాడు. ముసల్ది భయంతో నమస్కరించి వెళ్ళిపోయింది. ఈ పని నిజంగా ఇష్టమయే భార్యమీద కోప్పడి తన్ను విడిపించాడనీ, మళ్ళీ ఒప్పుదల పుత్తరం యిచ్చిరమ్మన్నాడనీ అనుకొని సంతోష పడింది.

ముసల్ది వెళ్ళిపోయాక, కాంతం భర్తతో ఆవేదనగా అంది. "చూశారా మీ ప్రాణస్నేహితుల వరస? వారి అభిరుచులూ, స్థాయి యిప్పటికైనా తెలిశాయనుకుంటాను"

'రవి' నిజంగానే శంకరానికి ప్రాణ స్నేహితుడు. రవి గుణ గణాలనూ, కార్యదక్షత్వాన్నీ గురించి, చాలా గర్వపడే వాడుకూడానూ. భార్య యెత్తిపొడుపుకి శంకరం యేంసమాధాన మిస్తాడు? ఆలోచించి యిలా అన్నాడు "జీవితం సంఘటనల చిత్రమయిన రూర్పు. సౌందర్యపిపాస సంఘటనని సృష్టించింది. ఆశ్చర్యమేముంది?"

కాంతం యీ సారి అమితంగా ఉద్రేక పడుతూ "అయితే సౌందర్య పిపాసతో అంధులై చెల్లెళ్ళు, కూతుళ్ళతో కూడా వాంఛలు పూర్తిచేసు కోవడానికి మీ మిత్రులు సిద్ధపడతా రన్నమాట---? యేదీ యీ పర్యాయం ఆ మిత్రుడు నా కంటికి కనపడమనండి, బుద్ధిచెప్పి వదులుతాను. ఆడదాని అందమన్నా, అభిజాత్యమన్నా యేమనుకొంటున్నాడో... దాని విలువ బోధిస్తాను... యెంతమంది అమాయక యువతులని ఇలా ఊచ్చులోకి దించారో మీ మిత్రులు... రానీండి కనుక్కుంటాను." అంది ఆడపులిలా గర్జిస్తూ.

మర్నాడు ప్రొద్దు పొడిచే వరకే 'రవి' రివాల్వర్‌తో పేల్చుకొని ఆత్మహత్య చేసుకున్నాడనీ, అంతకన్నా ముందు ఒక ముసలిదాన్ని కాల్చి చంపేశాడనీ శంకరానికి కబురందింది. ఈ వార్త వినగానే శంకరం కండ్లు అశ్రువులతో నిండిపోయాయి. రవిని అంతిమ యాత్రలో దర్శించడానికి, శంకరం ఆలోచిస్తూ యింట్లోంచి బయలు దేరాడు.

# కుహూ నిశీధిని

—శ్రీ కట్టి భీమలింగాచార్య

సీ॥ తొలకరి మొయిలు దొంతులు దొంతులను గూడి
యంతరిక్షమునేల నానె ననఁగఁ
గడవిలోపలి యసల్ గలగఁ బాఱిన నీటి
పెనువెల్లు లుర్వివ్యాపించె ననఁగ
జనకు నంభోధి ముంచిన కాలపురుషు ముం
పఁగ వచ్చు రవిజా ప్రవాహమనఁగఁ
గర్మసాక్షి దొలంగఁ గలుష కర్మల కర్మ
కాండ నైల్యము భూమిఁగప్పె ననఁగ
గీ॥ నతివఁగప గూడఁ గఱివేలు పతులగతుల
విశ్వరూపంబుఁ దాల్చి పృథ్వీ వధూటి
నాన ఖాలక పర్యంత మాక్రమించె
ననఁగనెక్కొనె నిరులు రోదోంతరమున

సీ॥ కార్య భారము చాల గల్గి కాలదుపంగఁ
జాలకల్లాడ సంసారి యింట
మన్మధాస్త్ర విమధ్య మాన మానస కామి
యభిసారిఁ గవయలేకార్తిఁ జెందఁ
బశ్యతో హరజన భ్రాంతి నెల్ల ధనాఢ్యు
లినుప పెట్టెలఁ గౌఁగిలించు కొనఁగ
మన్నేది మిన్నేది యన్న సంశయ మాని
వైమానికుల్ —వడ వడ వడంక
గీ॥ దుర్నిరీక్షణ దుస్తర దుర్వికార
దుస్సహ మహాంధకారా సందోహ సంహ్వా

తా ఖిలాకల్ప సంప్రత్పతాన యగుచు
భూసరోజాక్షి శోషిల్లి మూర్ఛవోయె.

ఉ॥ ఏ యెడఁగన్న నొక్క నరుఁడేనియుఁ గన్పడునట్టి చొప్పు లే
దే యెడ విన్న నొక్క పులుఁగేనియుఁ బల్కెడు సన్నలేదు భీ
షాకృయిత దుర్భరాంధ తమసావృత దిగ్గళకంబె కాక యే
లా యొనఁగూర్చినావు కమలాసన యిట్టి కుహూనిశీధినిన్

సీ॥ జగము లెల్లను జగా జిగి చూపి వెల్గించు
భాను సంద్రంబులోఁ బాఱవైచి
పండు వెన్నెల పిండుఁ బఱపి ముచ్చట గూర్చు
జాబిల్లి నెచటనో జాఱవైచి
కలకలా రావ సంకులములై కులికించు
పక్కి జంటలఁ బర్ణపటలి దార్చి
అఖిలలోక విలోక నానందకర మహా
ప్రకృతి సౌందర్యంబు బాడుచేసి
గీ॥ చెవులు గిపెట్ట పవన వీచికలు వీవ
గూఢచారుల నిజవృత్తి గుస్తరించి
తమ గృహంబులు సేరి కొందలమునంద
నేల సృజియించి తయ్య యీకాల రాత్రి

ఉ॥ ఏమి ప్రయోజనంబు గలదిట్టి మహాంధ కుహూనిశీధినిం
దామరసాస్య ! సద్గణము ధన్యత నొందెనొ ! లోకచక్షువు
ద్దామత బొందునో ! ద్విజ వితానము పెంపు వహించెనో ! సుధా
ధామము వంగెనో ! మఱివృధా సృజియించితివేల దీనినిన్-



వ్యాసము:

# ఆముక్త మాల్యదలోని పాండ్యుని కథ

—శ్రీ పప్పూరి రామాచార్యులు

(మే సంచిక తరువాయి)

మత్స్యధ్వజ మహారాజు విష్ణుచిత్తయోగీంద్రుల వలన శ్రీమన్నారాయణుని మహిమా విశేషములు సోపాన క్రమమున నెఱింగి అట్టి పరమేశ్వరుని గనుటకుం తగిన యోగమును సవిశేషముగా తెల్ప ప్రార్థించెను. ఆ యాళ్వారును ఖాండిక్య కేశిధ్వజ సంవాదరూపంబుగా ఆయన ప్రశ్నకు ఉత్తరమొసంగెను. ఆ కథ యిది:-

మిథిల దేశమున నిమి వంశమునందు ఖాండిక్యుడు కేశిధ్వజుడను ఇద్దరు రాజ కుమారులు, అన్నదమ్ముల మనుమలు, వేరువేరు రాజ్యముల పాలించుచుండిరి. ఖాండిక్యుడు యాగాది కర్మశీలుడు. కేశిధ్వజుడు బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడు. ఇరువురును సజ్జనులే. కాని వారిమధ్యన వైరము రాజుకొన్నది. తుదకది సంగ్రామముగా పరిణమించెను. ఇక్షుమతీ నది ఎల్లగా వారిరువురును సేనలుదీర్చి పన్నెండు దినములు పోరాడిరి. తుదకు కేశిధ్వజుడు జయించెను. ఖాండిక్యుని సేన తిరిగి పారగా అతడును మంత్రులును భటులతో గూడ అడవి జేరిరి.

కొండకోనల కోవులేర్పరచుకొని అరణ్య మధ్యమున నొకచో చుట్టును కంచె వేసికొని వారు పర్ణశాలలలో నివసించిరి. కేశిధ్వజుడు ఆ నృపుని రాజ్యమును ఆక్రమించి ధన ధాన్య పశు సంపదలను వశపరచుకొనెను.

కేశిధ్వజుని ఆశయములు రెండు. మృత్యువును జయించుట. అజ్ఞానమును తుదముట్ట నశింపజేయుట. ఇందుకొరకు ఆయన అనేక యజ్ఞయాగములను చేసెను.

ఒకపరి యజ్ఞమును చేయ సంకల్పించి దీక్ష వహించినప్పుడు ఒక ప్రమాదము సంభవించినది.

యజ్ఞపశువు యజ్ఞశాల సమీపమున పచ్చిక మేయుచుండి యేటి దరిని దట్టముగా పెరిగిన పొదరిండ్లలో దూరి కొంత దవ్వేగినది. అందు పొంచియుండిన బెబ్బులితోక త్రాచుపాము వంటిది, యమధర్మరాజు

విజయ ధ్వజము వలె ఇటునటు కదలుచు ఆ గోవునకు కనిపించినది. పులిని పసిపట్టి ఆ గోవు దిగులుపడి "అంబా"అని అరచుచు మెడనున్న గంట మ్రోయగా శాలవైపు పరుగెత్తెను.

కాని పిడుగువలె పెద్దపులి దానిని అడచిపట్టి గొంతుక్రోవి నెత్తురు పీల్చినది.

పులి నోటి గబ్బు, దాని సెలవుల ముసురుకొన్న మక్షికములు, అది నడచు వేగమునకు అల్లలనాడిన చెట్లు రాల్చిన ఆకుల రొద గోవుమీద దూకి నప్పుడు అది కావించిన బొబ్బరింతలు వీనితో గొల్లడు చేష్ట లుడిగి భూమిపై వ్రాలెను. మార్మెడ పెట్టిన గోవును కఱచుకొని పులి త్రెళ్ళ దాటినది.

తన శరీరమునకు గోవు కొమ్ముగ్రుచ్చి సోకకుండ దాని శరీరమును నేర్పుతో మలపుచు చప్పుడగునట్టు తోక నప్పళించుచు నెత్తురు పీల్చుచు పులి గోవును తన గవికి ఈడ్చుకొని పోవుచుండినది.

పొలము గాచువారు కూతలిడిరి. బ్రాహ్మణు లానదిని వార్చుచుండి ఇది చూచి చెట్ల కొమ్మలెక్కి చప్పటలు కొట్టి అదల్చిరి. సాహిణులు అశ్వా రూఢులై పులిని తరిమిరి. పులి గోవును వదలి తన మూతి కొనలు నాకుచు ఘటఘట ధ్వని సేయుచు మాటిమాటికి మలగి చూచుచు తూలుచు వన సీమలో మరుగైపోయెను.

పులి కొఱకిన కంఠనాళమునుండి నెత్తురు వెలికుబికిపోగా మెడ గండి నుండియే ఊపిరి వెడలగా మిడిగ్రుడ్డుపడి కొఱప్రాణముతో గోవు తన్నుకొను చుండినది.

అశ్వికులు తిరిగి వచ్చి ఈ వృత్తాంతమును కేశిధ్వజ మహారాజునకు విన్నవించిరి. ఆయన వెంటనే ఋత్విజులను పిలిపించి ప్రాయశ్చిత్త మడిగెను. వారు ప్రాయశ్చిత్త విధానమును మే మెఱుగము, కసేరు మునిని అడుగు మనిరి. ఆయన తనకిది తెలియదు శునక ఋషిని అడుగుడనెను. ఆయన నడుగగా ఇట్లు చెప్పెను:-

"మహారాజా ఈ ప్రాయశ్చిత్త విధానమును ఋత్విజులు గానీ కశేరువు గానీ నేనుగానీ ఎరుగము. మేమే గాదు ఇప్పుడున్న వారిలో ఎవ్వరు నెఱుగరు. కాని ఒక్కడు మాత్రమే ఇది ఎరుగును"

ఆ మహానుభావు డెవ్వడని మహారాజు ప్రశ్నించెను.

"ఎవ్వడు నీచే పరాజితుడై సప్తాంగములు నీకు నిచ్చి చెట్లుపట్టి కౌశాలతిప్పలుబట్టి తిరుగుచున్నాడో అట్టి నీ తమ్ముడు ఖాండిక్యునికి తప్ప ఇంకెవ్వరును ఈ విధిని చెప్ప సమర్థులు కారు. అంగీకారమైనచో మీరు ఆయన యొద్దకు వెళ్ళి తెలిసికొనుడు" అని శునక ఋషి పల్కెను.

తాను రాజ్యభ్రష్టునిగా జేసి అడవులకు పోనడచిన తన తమ్మునే ప్రాయశ్చిత్త విధిని అడుగ బొమ్మని ఋషులు పల్కినప్పుడు కేశిధ్వజు డిట్లు తలపోసెను.

"నేను తన్ను ప్రాయశ్చిత్త విధిని అడుగ వెళ్ళినప్పుడు ఆ ఖాండిక్యుడు నన్ను చంపెనా యజ్ఞఫలము నాకందువలన కలిగితీరును. కాక మత్సరము లేకుండ ఆయన వివరించెనా మఖతంత్ర మతంత్రముగాక సంపూర్ణమగును. ఎట్లయినను మదీప్సితము నెఱవేరును. కావున వెళ్లుటయే శ్రేయస్కరము" అని భావించి వెంటనే రథాధిరూఢుడై బయలుదేరి ఖాండిక్యుడున్న వనమును ప్రవేశించెను.

హరిణాజినమే ఉత్తరీయముగాం నిరాయుధుడై ఒంటిగను నాయన రథధ్వజమును గుర్తించి ఖాండిక్యుని వేగువాండ్రు కూతలిడి వలనవారిని హెచ్చరించిరి.

వలన బెదరినను ఖాండిక్యుడు కలత పడలేదు. ప్రజకు ధైర్యము చెప్పబంచెను. కనుమ కాచుటకు తగిన విలుకాండ్రను ముందు పంపెను. తానును విల్లందుకొని ఆగ్రహముతో కంచె దాటి బయటికి వచ్చెను.

వచ్చుచున్న శత్రును చుఱచుఱ జూచెను. రాజ్యముతోడి నన ఐశ్వర్యమునుగూడ అపహరించి మరల ప్రాణములనూ హరింపనచ్చుచున్నాడను రోషముతో మెఱపు మెఱసినట్లు వింటికి నారి సంధించి బాణము నెక్కుపెట్టి కేశిధ్వజునితో నిట్లనెను:-

"ఏనుగులు గుఱ్ఱములు గోవులు ధన ధాన్యములతోకూడ నా సామ్రాజ్యమును హరించియు చాలక మారీచునివలె జింకతోలుతో ప్రశాంతముగా మాలో జొచ్చి మా ప్రాణములను గొన జూచెదవో, దురాత్మా, క్రూర శస్త్రముచేత నిన్నీక్షణముననే పడ గెడపెదను."

అనుటయు చేయెత్తి కేశిధ్వజుడు ."సోదరా, అలుగకుము. నేను వంచనతో నిను చేరరాలేదు. యజ్ఞము సేయుచుండగాం యజ్ఞపశువును పులి చంపివేసినది. ఋత్విజులను మునులను దానికి నిష్కృతి యడుగగా నీకు

దప్ప ఇతరులకు ఆ వైనము తెలియదు కావున నిన్నే వేడ వచ్చితిని.
కోపము విడిచి నా కోరిక సఫలము చేసినను సరే, బాణము విడిచి నన్ను
సంహరించినను సరే. రెండింటను నాకు ఫలసిద్ధి అగునను యోజనతో వచ్చి
తిని. ఇందే నిలిచి మీ తీర్పునకు సిద్ధముగా నుండెదనని చేతులు జోడించి
నమస్కరించెను.

ఖాండిక్యుడు కోపముతో పాటు శరమును గూడ డించి, తరుషండము
జొచ్చి ఆంతరంగిక సభ జరిపెను. మంత్రులు, పురోహితులు, సుహృ
జ్జనము విన జరిగిన వృత్తాంతము వివరించి వారి అభిప్రాయమును తెలుప
గోరెను.

మంత్రులిట్లనిరి:-

"మహారాజా, దాయాది శత్రువు మనము శ్రమపడ కుండ తానే
మనిబారికి అగ్గమయ్యెను. పగదీర్చు కొనుట కిదే సమయము. ఇంక
దాక్షిణ్యమును దయను, తలంపకుము. ప్రజను కారకు మేపి చంపకుము.

"మా యాంద్రుసు బిడ్డలును గుంపులు కట్టి అడివిలో కూరాకు
గోయ వెళ్లినప్పుడు కంటకములు పదాగ్రముల గాఢగ దూసినవి. ఆ బాధకు
నిద్రరాక రేలు వారటమటించు చుండగా మాకును కన్నుమూయు నవ
కాశము లేకున్నది.

"మేమేకాదు నీవుపడునట్టి అవస్థయు వచింప శక్యము కాదుకదా!
రాజు కలిగినేని సప్తాంగములు గలవు. శరీర సుఖమైన శరీరాంగములు
ముందే సుఖము గలవగుట ఇందుల కుదాహరణము. వీనినిప్పుడు చంపితి
మేని రెండురాజ్యములు నీవశమగును. ఏ ఉపాయముననైనను శత్రువును
జంపి ఐశ్వర్యయుక్తుడై ప్రజానీతి రక్షణము చేయుటరాజునకు ధర్మము.

"దుస్సాధ్యుడగు శత్రువును అన్యాయమున సంహరించినను అట్టి
ధర్మ తిరస్కారము వలన గలుగు పాపమును ప్రజలను న్యాయముగా సంర
క్షించుట చేత తొలగించుకో వచ్చును.

"దేవేంద్రుడు మునుపు తన రాష్ట్రమునకు ముప్పు కలిగింప బోవు
విశ్వరూపుని బ్రాహ్మణుడనక సంహరింపలేదా! నిను నమ్మిన ప్రజ ఇడు
ముల బడి నవయు చుండగా శత్రువుమీద నీకీ దయ యేల?

"శిష్టుడగు నిన్ను ఇంతచేసిన దుష్టాత్ముని యెడ నెనరు జూపక

వాపీకూప తటాకాదులు నిర్మించి యజ్ఞయాగములు చేసి పోగొట్టుకొన వచ్చును.

"ఇంక కొన్నాళ్లు చూచి నీయందు తెగువ కలుగకున్న యెడల ప్రజలు తమయూళ్ళకు ఒక్కరొక్కరే మరలి పోయెదరు. అప్పుడు మీరు సన్యసించి ముని వృత్తి నవలంబింప నైనవలయును. లేదా శత్రువుతో హీన సంధికొడ బడవలెను తప్ప మార్గాంతరములేదు.

"తపము చేయ దొడగినను, కన్నులు మూసికొని కూర్చుండుట మాత్రమే యగును. పరిభవశల్య మెదలో గ్రుచ్చుకొని బాధ కలిగించు చుండగా ధ్యాన మెట్లుకుదురును.

"పూర్వము పరశురాముడు తని తండ్రిని చంపిన రాజులను వెదకి వేచి పిల్ల పిల్ల తరము సంహారము చేసి తర్వాత మునియయ్యెను. వైభవము వలదను కొన్నను పగ తెగకుండా శాంతికూడ కలుగదుగదా?

"పగయు వగయు విడచి ఉన్నదానితో తృప్తి పడుట సామాన్య సంసారి లక్షణము. రాజని అనిపించు కొన్నవానికి కలిగిన శత్రుకృత తిరస్కారమును శాంతి ననుభవించు కాలమున నైనను మఱువ తగదు.

"పెద్దపులి కొండదిగి కన్నుల కలకచేత ఊళ్ల నడుమకు వచ్చినప్పుడు ప్రజలు కనికరించి దాని కలక మానుకొనిచ్చి అదిగవి చేరినప్పుడు కత్తి కఠారులు చేబూని గవి ప్రవేశించి దానిచే హతులగుటను సహింతురా? లేక అది కంటి కలకచే ఊరిలో పడినప్పుడే గుంపుకట్టి అదల్చి చంపెదరా ఆలోచింపుడు.

"ఇప్పుడు మన వశమైన బలవ ద్విరోధిని పోవిడిచిన తర్వాత మీ రాజ్యము నేవిధముగా సంపాదింతుమో ఆ ఉపాయములను వ్రేలుమడచి లెక్కింపుడు చూతము. వచ్చిన అవకాశమును జారవిడుచుట వివేకము గాదు.

"అలసటచే పరున్న మనుజుడు కలియుగమనీ, కూర్చున్నవాడు ద్వాపరము, లేచినిలుచున్నవాడు త్రేత, నడుచు చున్నవాడు కృతయుగమనీ ఋగ్బ్రాహ్మణమున ఇంద్రుని వాక్యము కలదు.

"తన రాజ్యములోని లోపములను సవరించుకొని శత్రురాజ్యము లోని ఛిద్రములను కనిపెట్టుచు, ఆప్తుల మంత్రాలోచనము లందు విశ్వాసము నుంచి శత్రువు చిక్కున బడినప్పుడు త్వరపడి సంహరించు వాడును

సమయము అనుకూలము కానంత వరకు తొందరపడక వేచియుండువాడును, చిర కాలము రాజ్యము నేలగలడు. కావున పగ దీర్చు కొనుటకిది సమయము, లే లెండు."

అని మంత్రులు దండనాథులు ఖాండిక్యుని వేగిర పెట్టిరి.

ఆ భూనాథుడు అంతయువిని శాంతముతో నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"సుహృజ్జనులారా, మీరుచెప్పునది సమంజసమే. కాదనను. ఆ విధముగా చేసినచో మనకు రాజ్యమంతయు దక్కును. కాని వాడు పరలోకమును జయించిన వాడగును. ఈ రెంటియందును ఏది వాసి అన్నది విచారింపదగును. పరలోక సుఖము శాశ్వత మైనది. మహీరాజ్యసుఖము అల్ప కాల భోగ్యము. దీని నిమిత్తము పాపముచేసి పరమును పోగొట్టు కొనుట ఏమి వివేకము ?

"బద్ధాంజలియై వినయ వినమితుడై తన మఱుగు సొచ్చిన వానిని శత్రువుపైనను కినుక వహించి చంపుట పరలోకార్జన బుద్ధిగలవాడు చేయ దగని కార్యమను కణ్వవాక్యమును మీరు వినియే యుందురు."

అని పలికి ఖాండిక్య మహారాజు వెంటనే వెడలి తన దాయాదిని చేర బోయి, వచ్చిన కార్యమడిగి తెలిసి కొని అందుకు తగిన ప్రాయశ్చిత్త విధిని నిర్ణయించి పంపెను.

కేశిధ్వజుడును తనపట్టణమునకు వచ్చి ఆ విధి ననుసరించి క్రతువును సాంగముగా నొనర్చెను. అతడు దీక్షాంత స్నాన మాచరించి ఋత్విక్కులను సదస్య సమూహమును పూజలతో దక్షిణలతో తృప్తి పరచి తక్కిన పరిజనులకు గూడ అభిమతార్థము లొసంగెను.

మఱియు కోరినవారి అక్కఱల తీర్చి అక్కడికిని మనః పూర్తి చాలక ఖాండిక్యునికి గురుదక్షిణ యిచ్చువాడై పురి వెడలి అడవి నున్న ఖాండిక్యుని దర్శించి ఎయ్యది వలయునో వేడుమనెను.

ఆయన మరల మంత్రి పురోహితులను పిలిచి "కేశిధ్వజుడు నన్ను గురు దక్షిణ వేడు మనుచున్నాడు, మీరు నా కనురక్తులు, మరి ఏది కోర దగునో యోచించి నిర్ణయింపుడనెను.

వారీవిధముగా ననిరి :—

"మహారాజా, నేడుగదా మనకు దైవము కలిగెను. బాంధ వాప్త జన పోషణ కంటెను ధర్మమున్నదా ? సాగర పరివేష్టిత భూవలయము

నంతయు గురుదక్షిణగా వేడుదు. ఇంతకంటెను మమ్ము ప్రోచుఉపాయము కనుబడదు.

"మనకెప్పుడు బలము చేకూరును, శత్రురాజ్య మాక్రమించుటకు ఎప్పుడు తఱి పర్వడును ? అట్టిదికలిగినను పోరులో విజయము సంభవించు నను నమ్మకము లేదుగదా."

"చావక నోవకసిరులబ్బవు. బంధుసుహృత్తతికి ఒక్క కీడు కలుగ కుండనే నీ భాగ్య సంపన్నతచేత కావ్యమిటు చేరినది. దీనిని జార నిడువ కుడు మహారాజా."

అను మాటలకు ఖాండిక్యుని మోమున చిఱునవ్వు వెలసినది. ఆయన ఇట్లనెను :—

"అర్థసాధన పరతంత్ర కోవిదులు మీరు. కాని మహాసుఖదాయి యైన మోక్షమార్గాన యవిచార కోవిదులుగారు. ఈ వచ్చిన మహా మహుని పరమార్గము వేడక అతిచంచల రాజ్యలక్ష్మి నిమ్మని ఎట్లు చని వేడ గలను ?

"మేమిరుపురమును నిము పంకోన్నసన్నులము. మాబోటులకు రాజ్యమా లక్ష్యము ? వా డుత్తమ యోగాగ్రయుడు. వానినుండి అప వర్గ ప్రదంబగు యోగ రహస్యమును సంపాదించుట యుక్తమా, లేక భూమినడిగి సంపాదించుట యుక్తమా విచారింపుడు."

నన్ను విడువుడని ఆ రాజ పుంగవుడు వీడు వెల్వడివచ్చి కేశి ధ్వజుని కలసికొని "సోదరా ! నీవు నిజముగా గురుదక్షిణ నిచ్చెదవా ?" అనెను. "ఇయ్యవలచి గదా మరివచ్చినది. ఇచ్చునది తథ్యము," అని ఆతడుత్తర మిచ్చెను.

ఖాండిక్యుడిట్లడిగెను :—

"తమ్ముడా. నీవు అధ్యాత్మరతుడవు. సకల భవక్లేశ నాశకరంబగు నదియేమో అట్టివిద్యను బోధింపుము."

కేశిధ్వజు డాశ్చర్య పడెను. అతనికి నవ్వువచ్చినది. "అన్నా, నిష్కంటకమగు రాజ్యాధిపత్యము నడుగక ఈ బ్రహ్మవిద్యనేల అడిగితివి? క్షత్రియునికి రాజ్యము కంటె వేరు ప్రియమేది యుండును ?" అనెను.

ఈ వింత కోరిక కోరినందులకు ఖాండిక్యుడు నిరూపించిన కారణ మిది.

"చాపల్యము అజ్ఞునికి కలుగును గాని వివేకికి కలుగదు. న్యాయ యుద్ధమున శత్రువును జయించు శౌర్యమును, ప్రజాపోషణమును రాజునకు ధర్మములే. కాని రణంబుననోడి రాజ్యమును పోగొట్టుకొన్న నాకు రాజధర్మమును విడనాడుట వలన పాప మంటదు. కావున తత్త్వధికారము లేని నేను ఆ ధర్మమును విసర్జించుట తప్పుగాదు. నీవుఇచ్చుటచే నేను భూనాథుడనైతినేని అట్టిది భోగమునకే అగునుగాని ధర్మమునకు గానేరదు. రాజన్యుల కడిగి కుడుచుట తగదు. క్షత్రియులకు భైక్షంబు కీడు. నా మంత్రులు సామ్రాజ్యమును వేడుమని చెప్పుటలో ధర్మము నెపమున లోభమే కానవచ్చుచున్నది. కావున అట్లు వేడుట అయుక్తమని భావించి రాజ్యము వేడనొల్లనైతిని. రాజ్యముమీద మమత మానని జడాత్ముల వలె జ్ఞానులు దానికాస వదులుదురా? అహంకార మద్యపాన మత్తులకే గాక అట్టి ఆశ మాబోటి వారికేల?"

ఇది విని హర్షించి కేశిధ్వజు డిట్లనెను.

"అన్నా, నావలన యజ్ఞయాగాదులు రాజ్యపాలనము చేయించునది గూడ అవిద్యయే. వానిమూలమున మృత్యువును జయించుట కాకపోగా భోగముల ననుభవించుట మూలమున పుణ్యఫలమును క్షీణింప చేసుకొనుచున్నాను. పాపశేషము జన్మాంతరమున కల్గించు నట్లే పుణ్యశేషము గూడ దానిని అనుభవించుటకు క్రొత్తపుట్టువును కల్పించును గదా!

"మన ఈ నిమి వంశము పావన మైనది. ఆ భాగ్యము చేతనే తత్త్వ వివేచన చింత నీకు పొసగినది. ఇంక నీవు వినదలచిన విద్యావిధమును తెలియ జలికెదను వినుము.

"అజ్ఞానమనెడు మహా వృక్షమునకు వేరులు రెండు. ఆత్మకాని శరీరమునే ఆత్మయని భ్రమించుట ఒక్కటి. తనవిగాకుండు గృహారామములు తనవి అని అనుకొనుట రెండవది. తన శరీరమే తనదైరవై యుండు నప్పుడు సతీసుతులు తన వెంటవత్తురా?

"దేహము పంచ భూతముల సమ్మేళనము వలన నైనది. ఆత్మ దానికి వెలుపల వెలుగునది. అట్లున్నప్పుడు కళేబరము నెవ్వడు ఆత్మగా దలచునో వాడు వెఱ్ఱివాడు గదా! మృత్యువున కిగ్గమగు శరీరమునందు జనించు పుత్రాదుల యెడ మమకార ముండదగదు.

"ఆత్మ వేరు శరీరము వేరని ఎవ్వడు గుర్తించునో అట్టివాడు అనుభవించు భోగములు ఆత్మ కంటవు. ఈ యొడలే ఆత్మ అని అనుకొనువానికి వాని కర్మ ఫల మంటుట తప్పదు.

"మన్ను, నీరు మొదలైనవాని పూత వలన గృహకుడ్యములు నిలుచునట్లు శరీరాంగములు అన్నపానాది పోషణముచేత నిల్చును. అంతేకాని ఆత్మకు భోగములవలని ప్రయోజనము సున్న.

"జనన మరణాది రూపమైన ఈ సంసార మార్గమునందు జీవుడు ఎంత దూరము ప్రయాణము చేసెనో, ఎన్ని వేల రూపము లెత్తెనో ఇంకను ఎన్ని జన్మము లెత్తునో తెలియదు.

"జీవునికి ఈ పుట్టువులో సుఖ దుఃఖములనెడి ధూళి తాకి ముసుగువలె కప్పుకొని యున్నది. జ్ఞాన మనెడి ఉష్ణోదకముచేత వాసన లనెడి ఆ మురికిని క్షాళితము చేసికోతగును. అప్పుడే ఆ పాంథుని మోహమను భ్రమ తీరి పోగలదు. అ మోహభ్రమ మంతరింపగా జీవుడు స్వస్థుడై తనకు సహజమగు దుఃఖరహితానందమును పొందగలడు.

"నీరు శీతలమైనది. కుండలో నీరు బోసి క్రింద మంట బెట్టినయెడల నీటికి అగ్ని సంయోగము కలుగకున్నను కుండ వేడిమి వలన లోని నీరుఉడికి శబ్దోద్రేకాది ధర్మములం బొందును. అగ్నిని తీసివేసినచో మరల నీరు చల్లనగును.

"ఆ విధముగనే ఆత్మ ప్రకృతి సంబంధముచేత అహంకారాది గుణముల వలన దూషితుండై ప్రాకృతంబులగు గుణంబులం బొందును. ఆత్మ విలక్షణుండు; అక్షయుండు ఆత్మకు ప్రకృతి సంయోగముల వలననైన అవగుణములను తప్పించు శక్తి యోగమునకే గలదు కాని ఇంకొక్కటికి లేదు."

అని కేశధ్వజు డుపన్యసించెను.

ఖాండిక్యుడు సంతృప్తుడై "సోదరా, నిమి వంశంబున విజ్ఞాత యోగశాస్త్రార్థుండవు కావున నాకు నీ యోగ శాస్త్రంబు సమస్తంబును నీవే విస్తరింపవలయు"నని వేడుకొనెను.

కేశిధ్వజు డంగీకరించి ఇట్లని చెప్పదొడంగెను:-

"మహీపాలా, పునర్జన్మము కలుగకుండ బ్రహ్మాత్వమును పొందు యోగమును వచించెదను సావధానుడవై ఆకర్ణింపుము.

"ప్రాణికోటికి బంధనము, మోక్షము, ఈ రెంటికిని కారణము మనసే. పశు, పుత్రకళత్రాది విషయంబులందు మనసు తగిలెనేని అది బంధ

కారి యగును. వాని యందది తగులనీకుండ నిర్లిప్తుడగునేని అదియే ముక్తి కారి.

"విజ్ఞానముచేత మనస్సును విషయాదులనుండి త్రిప్పవలెను. దానిని పరబ్రహ్మమునందు లగ్నము చేయవలెను. సూదంటురాయి ఇనుమునకు ఆకర్షణ శక్తిని ఇచ్చునట్లుగా తన్నే ధ్యానించు యోగికి పరబ్రహ్మము ఆత్మ భావము నిచ్చును.

"యమ నియమాదికమగు స్వప్రయత్నముచేత సాత్వికమైన మనో గతిని బ్రహ్మ సంబంధినిగా జేయు నేర్పె యోగ మనబడును. దానిని సాధిం చినవాడు యోగి.

"బ్రహ్మచర్యము మొదలైన ఐదు యమములును అధ్యయనాదులగు నియమంబులైదును మనోనైర్మల్య సంపాదనమునకు సాధనములు. కావున వానిని కాములు నిష్కాములుగూడ ఆచరింపదగును. కోరికలతో వీని నాచరించు వారి కవి విశిష్టమగు ఫలముల నొసంగును; నిష్కాములకు ముక్తినిచ్చును. కావున ముక్తి నపేక్షించువాడు వానిని వదలరాదు.

"మరియు ముక్తికాముడు ప్రాణాయామ సాధనచేత పవనములను స్వవశము చేసుకోదగును. తర్వాత ప్రత్యాహారమును సాధింపదగును. ప్రత్యాహార మనగా శబ్దాది విషయములందు ప్రవృత్తములైన ఇంద్రియము లను వానినుండి త్రిప్పి మనస్సున కధీనంబులు చేసికొనుట. ఇది ముముక్షున కవశ్య కర్తవ్యము.

"అతి చంచలమైన ఇంద్రియములను నిగ్రహించుకో జాలకున్న వాడు యోగ సాధకుడు కాజాలడు. ప్రాణాయామంబున పవనంబులును ప్రత్యా హారమున ఇంద్రియములును వశమైన తర్వాత చిత్తమును బ్రహ్మాధీనము చేయవలెను."

ఖాండిక్యు డిట్లు ప్రశ్నించెను.

"సోదరా! వినదలచినది వింటిని. కాని ఇంకను సంశయము తొలగ లేదు. మనస్సున కేది శుభాశ్రయము? సకలమునకును ఆధారమగు వస్తువేది? దేనిని ధ్యానించుట వలన సమస్త దుఃఖములును తొలగిపోవునో దానిని నా కెఱింగింపుము."

కేశిధ్వజుడు మరల నీరీతి ఉపన్యసించెను. "పరబ్రహ్మమే మనస్సునకు ఆశ్రయము. అది రెండు విధములు: [illegible]

రూపములు గలవి. పర మనగా రూపములు లేనిది. ఆకారములేని వస్తువును ముముక్షువు ఉపాసన గావింపలేడు. బ్రహ్మాది స్తంభ పర్యంతము నామ రూపములుగల అపరమును ఉపాసించుటవలనగూడ ప్రయోజనము లేదు. ఏలన మూర్తివంతమైనది ఆదిమధ్యాంతరములు గలది. అనగా పుట్టి పెరిగి వినాశము చెందు గుణము కలది.

"అశాశ్వతమైనదాని నారాధించి జీవుడు శాశ్వతమగు స్థితిని పొందజాలడు. కావున సాధకునకు ఈ రెండును పరిత్యాజ్యములే.

"కాని ఈ చరాచర ప్రపంచము, పరము అపరము అంతయును విష్ణు సమన్వితంబై ఆ దేవునికి శరీరంబునై యుండును. ఆ విష్ణుశక్తి పరాపర నామముల చేతనే గాక వానికి వేరైన కర్మ శక్తియను నామమున గూడ వెలయును.

"అపరమను పేరుగల క్షేత్రజ్ఞ శక్తి కర్మాఖ్య శక్తిచేత చుట్టబడి జన్మ జరా మరణాది సంసార తాపములకు చిక్కి సుఖ దుఃఖ వేదనల ననుభవించుచు ఆయా కర్మాను భవములకు తగిన శరీరముల పొందును. ఆయెత్తిన శరీర తారతమ్యముల ననుసరించియే విజ్ఞానము యొక్క అల్పాధిక్యముల గాంచుచుండును.

"ప్రాణరహిత వస్తుజాలమునందు ఆ చిచ్ఛక్తి కొంచెముగానుండును. వృక్షాది స్థావరములందా శక్తి రెట్టింపుగా నుండును. ఆ విధముగనే వరుసగా ఎర్ర, జెట్టి, పక్షి, మృగాదులందు అది హెచ్చుచు నుండగలదు.

"గోవు ఏనుగులందంతకంటెను, మనుష్యులయందు మరింతగను, యక్ష గంధర్వాదులందు అంతకు మించియు, దేవతలయందు వారికంటె అధికముగను, దేవేంద్రునియందు, దక్షునియందు గొప్పగను, హిరణ్యగర్భునియందు మహోత్కృష్టముగను ఉండును. ఈ రూపకోటు లన్నియు ఆ విష్ణుని దేహ సమూహమే. ఆశక్తి ఊహింపరానిది. అది ఇంతయని వర్ణింపరానిది. ఈభూత ప్రపంచమునందంతయు ఆశక్తి ఆకసమువలె నిండి సంపూర్ణముగా నుండును.

"మహారాజా, ముందునేను చెప్పిన పరమున కంటె అతీతమైన ఈ శక్తికే విష్ణువని పేరు. అదియే యోగులచేత ధ్యానింపదగినది. అది రూప రహితమైనది. కాని ప్రాజ్ఞులు దానిని సత్ అను పేరున వ్యవహరించెదరు.

అది సమస్త శక్తులకును ఆశ్రయభూతము. అది విశ్వములోని విభిన్న రూపములకంటె విలక్షణమైనది, అత్యంత మాహాత్మ్యము చేతనొప్పునది.

కల్యాణ ప్రదమైనది. అట్టిపర బ్రహ్మమే నిజవిలాసము చేత దేవతిర్యఙ్మనుష్యులయొక్క నానారూపవ్యాపారములగల సృష్టిని, రామకృష్ణాద్యవతారములను లోకోపకారమునకై కల్పించుచుండును.

"ఆ దేవుని ఈ లీల కర్మానుభవము కొఱకుగాదు. అతనిని కర్మ అంటదు. సకల జాతులందును పుట్టి సకల వ్యాపారములు చేయుచుండు ఆ పరబ్రహ్మచేష్టలను రావణాది దుష్టశక్తులడ్డగింప జాలవు.

"మోక్షము కోరువాడు బద్ధముక్తాది అనేక రూపములుగల ఈ విశ్వశక్తిని ధ్యానింప జాలడు. కావున జ్ఞాన సిద్ధికి పరవాసుదేవుడు, అతని రామకృష్ణాద్యవతార స్వరూపములే చింతనీయములు.

"యోగి చిత్తమునందు నిల్చిన విష్ణువు అతని సమస్త కిల్బిషములను అగ్నిజ్వాల ఎండిన మ్రాకులను దహించినట్లు నశింప జేయును.

"కావున సకల శక్త్యాశ్రయుండైన ఆ పరమాత్మునియందు చిత్తంబు నిల్పుట విశుద్ధమగు ధారణ అనంబడును. వస్తు సంబంధము చేత చంచలమైన మనస్సునకు ఆదేవుడు శుభాశ్రయుడు. మోక్షదాత అతడే.

"విష్ణువునకు భిన్నులైన బ్రహ్మాది దేవతలు కర్మయోనులగుటవలన అశుద్ధులు. కావున చిత్తంబున కవలంబనీయులు కారు ఆధారము లేనిదే ధ్యానము సిద్ధింపదు.

"ధ్యాన ధారణ విషయంబై శుద్ధమైన స్థూల రూపాంతరము ఆ పరబ్రహ్మకు గలదు. అదియే శ్రీమహావిష్ణుస్వరూపము. శ్రీవత్సాంకము చతుర్భుజములు, చక్రాద్యాయుధములు గల ఆ మూర్తి యొక్క ఒకొక్కయవయవమును ధ్యానించుచు తర్వాత మూర్తి నంతయు, సర్వకాల సర్వావస్థలలో ఎడతెగక భావించుయోగి క్రమాభ్యాసము వలన విష్ణుసారూప్యంబు నొందును. ఇట్లు ముక్తుడైన వానికి సురలు మానవులను భేద బుద్ధి అంతరించును. అప్పుడు శ్రీహరికంటె నతడు భిన్నుడని భేదము నెవ్వారు కల్పింప గలరు ?

"సోదరా, బంధచ్యుతి కొఱకైన ఈ అంగాష్ట కాఖ్యంబగు యోగము సవిస్తరముగా చెప్పితిని. ఇంకేమి విన వలతువు ?"

అని కేశిధ్వజు డడిగెను.

"నేను కృతార్థుడనైతిని. నేను కోరదగినది ఇంకెద్దియును లేదు" అని ఖాండిక్యుడు పల్కి అతని నారాధించెను.

కేశిధ్వజుడును వెనుకటి ద్వేషమును వదలి తాను సంగ్రామమున జయించిన అతని రాజ్యమును అతడు వలదన్నను ఇచ్చివేసెను.

ఖాండిక్యుడు ఆ రాజ్యమునందు తన కొడుకును నిలిపి అడవికేగి గోవింద చరణారవింద విన్యస్త మానసుడై మధుమధన సాధర్మ్యంబు నొందెను.

విష్ణు చిత్తులవారీ విధముగా పాండ్యునికి ముక్తిసాధన తెరంగెఱింగించి, ఆయన ఇచ్చు సత్కారముల నంది మహావైభవమున శ్రీ విల్లిపుత్తూరు చేరి జరిగిన సంగతులు మన్నారు దేవునికి విన్నవించి పొచ్చిన భక్తి వైరాగ్యములతో యథారీతిగా తులసీదామసేవ యొనర్చుచుండెను.



కవిత:

# మధుర బంధాలు

—శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి

గాలిం దేలి పయోద మండలమునం గాలూని యుండాఁగ కే
యే లోకమ్ములనో విహారములు హాయిం జేయు స్వైరుండ నీ
లోలం బాలకపాళిఁ గట్టువడి నిల్తున్- మందమందానిల
వ్యాలోలమ్ముల బంధన క్షమ పటుత్వం బెద్ది పాటిల్లునో!

సక లక్ష్మవలయమ్ము సుద్దవిడి నాజ్ఞాపింపఁగాఁ జాలు పా
లకులన్ భ్రూకుటి భంగమాత్రమున సల్లాడింపఁగాఁ జాలి చా
లక యుంటిన్ భవదక్షి సంజ్ఞల సముల్లంఘింపఁగా- నీ మృగాం
బక యుగ్మంబున నాజ్ఞ వెట్టఁగల యే ప్రాగల్భ్యమే పాయునో!

ప్రకృతి స్ఫార మనోజ్ఞ చిత్రము లపూర్వంబౌ కళాసంపదన్
ప్రకటీభూతముగా రచించు విపులప్రావీణ్యముం గల్గి తా
వక చిత్రమ్మును దప్ప నన్యము రచింపఁ జాల కున్నాఁడ— నిం
తకు నీ రూపమునందు నే మహిత సౌందర్యమ్ము పెంపొందునో!

యావత్సృష్టికి మూలహేతు వగు బ్రహ్మమ్మున్ మహః పూర్ణమున్
భావంబందుఁ జిరంబుగా నిలిపి చింతంజేయు ధీశాలినై
కావింతున్ భవదీయ చింతనమె యేకాలంబు- నీ చింతనన్
భావోన్మేషముఁ గూర్పఁ జాలిన మహత్త్వం బెద్ది వర్తిల్లునో!

ఆకసమ్మునఁ దేలియాడు నప్పటి కంటె
నీ ముంగురులఁ జిక్కి నిల్చినపుడు
ధరణి నాయకుల నదల్చునప్పటి కంటె
నీ కనుసన్నలన్ మెలఁగునపుడు

ప్రకృతి చిత్రమ్ములు వ్రాయునప్పటి కంటె
నీ చిత్తరువుఁ దీర్చువైచునపుడు
పరతత్త్వచింతన జరుపు నప్పటి కంటె
నీ చింతనం బాత్మ నెఱపు నపుడు

అనను భూతం బపూర్వంబు ననుపమాన
మైన యానంద మేదియో యతిశయిల్లు
ప్రణయినీ ! యేమనెద నీదు బంధములును
సుందరమ్ములు మాధురీ బంధురములు.



## పుస్తకపరిచయము :

# శివానందలహరి

అనువాదము :
శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మ
" రోహిణి "

ప్రతులకు :
స్నేహలతాకవితాసంఘం.
కొవ్వూరు, ప. గో. జిల్లా.
వెల : 0–38 nP.

శ్రీమచ్ఛంకర భగవత్పాదుల శివానందలహరి కిది ఆంధ్రపద్యానువాదము. నూరు శ్లోకములకు నూరు పద్యములు. అనువాదము తేలికపనియని యనిపించునది. మరి దానంత తలబ్రద్దలు చేయునదిలేదు. కష్టములతో మనశ్శాంతిని ప్రసాదించు ఈశ్వరుని స్తుతించుటకంటె వేఱు గత్యంతరముగానక దీనిని తాను 1923 లో తెనిగించినట్లు అనువాదకర్త్రి చెప్పుకొన్నది. అదినేడు ప్రకటింపబడినది.

ఎంతపరమార్థసాధనముగా వ్రాయబడినను మూలగ్రంథము కేవలము స్తోత్రముగాదు. కావ్యభాషాప్రభుత్వము కలిగిన ఉత్తాలమైన భావనావ్యాపారముతోడి సిసలైన కవితాగ్రంథమది. శ్రీమతి వెంకటరంగమ్మగారా గ్రంథమును యథాశక్తి ననువదించిరి. సాధారణమైన దారా శుద్ధియున్నది. పద్యరచన ఒక విద్యగా తెలియనితన మీ గ్రంథమున స్పష్టముగానున్నది.

ఉదాహరణమునకొక శ్లోకము, దానియనువాదమును.

సదా మోహాటవ్యాంచరతి, యువతీనాం కుచగిరౌ
నటతి. ఆశాశాఖాస్వటతి. ఝుడితిస్వైరమభితః
కపాలిన్ ! భిక్షో ! మేహృదయకపి మత్యంతచపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ, భవదధీనం కురు విభో !

చపలతఁ జిత్తమర్కటముఁ జయ్యన మోహవనాంతరంబులన్
విపులకుచాద్రి శృంగముల వేగ దురాశ విశాల శాఖలన్
దెపుడు ననేక వాంఛల మహేశ చరించుఁ బ్రగాఢ భక్తితం
త్రపు దృఢ బద్ధఁ జేయుమిక తావ కధీనముగా జగత్ప్రభూ !

మిగిలిన విషయముల నటుంచినచో మూల శ్లోకమున నాల్గు శివ సంబుద్ధు లున్నవి. హృదయకపి నాల్గుపనులు చేయుచున్నది. ఆ నాల్గు పనులనుండి దానిని తప్పించి స్వాధీనము చేసికొనవలసిన వానికొక నాల్గు తత్సంబంధములైన లక్షణములుండ వలయును. కపాలిన్ – భిక్షో – శివ – విభో – ఈ నాల్గును సంబోధనలు. మూలమునందలి క్రియా శబ్దము లున్నవి. చరతి – అటతి, ఈ రెండింటికిని అర్థమొకటే కాదు, నటతి. ఇది మొదలింకొకటి. అనువాదమున ఈ సొగసు లేమియును రాలేదు. రచయిత్రి కసలు శిల్పదృష్టి లేదు. భక్తి యున్నది. భక్తితో వ్రాయబడిన పద్యములు కావున [illegible]

మోహావనాంతరమని — యువతీనాంరు చగిరేను విపులకు చాద్రి శృంగములనని— ఆశా శాఖలను దురాశ విశాల శాఖలని — తెనుగున వ్రాయుట శబ్దముయొక్క శక్తి తెలియక వ్రాయుట మూలమునందలి సంబద్ధులు తెనుగున కెక్కనేలేదు. శివభక్తిపరులు చదువుకొన దగిన పుస్తకము.

— క్షేమేంద్ర

# శ్రీ సుబ్బరామశాస్త్రి కావ్యావళి

**మధుర భారతి-** గేయసంపుటి- వెల 2 రూపాయలు;

**మధుర సంక్రాంతి-** గేయములు వెల రు 1. 25,

**ఆంధ్ర భారతి :** ఖండకావ్య సంపుటి రు 1. 25,

**అభిషేకము:** శతకధోరణిలో 40 పృష్ఠాల సం. 0.75,

ఇవన్నీ దొరికే చోటు, భారతీ నికేతన్, విజయవాడ-2

తెనుగు కవులలో పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారొక ఉద్యమము. స్వయం కృషిచే రచనలు చేసి, వానికి పుస్తకరూప మిచ్చి, కృతి సమర్పణము, ఆవిష్కరణము మొదలయిన కార్యక్రమాల ద్వారా స్వయం ప్రకాశకులయిన కవులలో వీరగ్రగణ్యులు. వీరి గ్రంథములు అష్టాదశసంఖ్య నందుకొన్నవి కలచుకొన్న, వానిని అచిరకాలములోనే రెట్టింపు చేయగలరు. వారికట్టి పట్టుదలా, దీక్షా ఉన్నవి. 'భారతి' మకుటముతో వీరు పుస్తక శతకం పూర్తి చేయ తలపెట్టినట్లున్నది. ఇప్పుడు సమీక్షకు వచ్చిన నాలుగు కావ్యములలోనూ రెండు గేయసంపుటులు. తెన్నేటి విశ్వనాథంగారికి కృతియిచ్చిన మధుర భారతిలో పాటలు 27. దీని ముఖపత్రము మీద వేసినట్లు, "వానరను నునుసిగు పాతరలవేయవే తీయవే, తీయదానిమ్మనే, నిమ్మవే"యని పాడుకొనే ప్రణయ గీతములు. అయితే ఈ గీతికలు దాంపత్య ప్రణయ నాగరిక ప్రవృత్తములే యని తొలిపలుకు రచించిన శ్రీ శివశంకర స్వామివారు పరిశీలనచే గ్రహించినారు. అందుచేత ఆ ప్రేయసిని "దానిమ్మవే" అనవచ్చు; "నిమ్మవే" అనవచ్చు; ఆమెగారు "పలుకవే నా చిలుక, తెలుపవే నా అలుక" యని "దురిరేయి వచ్చి ప్రేమల నటియించెడి మతకరితో మొగమాటములేకయే" అని చిలుక రాయబారము పంపవచ్చును. పాటలకు అను

వైన వివిధ గతులలో ఈ గేయరచన సాగింది. ఈ ముద్రణలో కంటె మధుర గాయనీ కంఠములో ఈ మధుర భారతి ఎక్కువ మధురించ వచ్చును. "మధుర సంక్రాంతి" పాటలన్నీ ఖండగతిలో నడిచాయి; "సంక్రాంతి" పండుగ సంబంధించిన ముగ్గులు, భోగిమంటలు, సరదాలు, మరదళ్లు, గొబ్బిళ్లు గోవృషభాలు. వీటిని గురించి వ్రాసినవే. వీటి మాధుర్యం సంక్రాంతి సమయంలో పాడే బాలబాలికల కంఠంలో వినవలసిందే. ఇంక పద్య సంపుటములలో రామలింగస్తవమైన నలభై పద్యాల సంపుటం. ఒకటి దీపావళికి కూర్చినదేనా ఆ దీప చిత్రములో పత్రంతో

ముసలమ్మల్ పడుచమ్మలున్ ప్రమదలన్ పుట్టించు దీపాలకై
పస మైముఱవఁగూరె ! ఆ వెలుగు నీవా ! రామలింగేశ్వరా !

అని మకుటముతో ప్రకటించుకొన్నారు. సాంఘీగా సాగిపోయిన యీ పద్యాలలో శతకధోరణి ప్రస్ఫుటము.

గర్జక సేయుము నీ శిరస్సుపయి గంగాదేవి పేరాశమై
ఊర్జస్సుక గళబద్ధపన్నగములో హా ! యూరకు కర్ణమ్ములన్
వర్ణన్యాద్రులహర్నిశల్ మధుర వాగ్బంహిష్ఠులై నిల్వరా
దర్శాలో వినిపించు నా పిలుపు ? నాథా రామలింగేశ్వరా.

ఆంధ్ర భారతిలోని ఖండ కావ్యము లయువింటిగుంచును పెద్దన గండపెండేరము రామదాసు, దొక్కా సీతమ్మ, మాధవశర్మ, త్యాగరాజు ఇతకథలకు కవితా వస్త్రములు కట్టిన సన్నివేశములు. వీనిలో కూడ కవిగారి ఛందస్సునైపుణ్య విహారము చేసి కథా సంవిధానము సర్కు చెట్టపట్టు నాని కగ్గినది. రస వ్యంజనము కంటె వస్తుగుంఫనమే వీనియందు ప్రకాశమానముగు నున్నది. ఆంధ్ర భారతియగుట చేత తెలుగు వారి తీయదనము తెలుగు నాడికే అందించే ప్రయత్నము జరిగినది.

ఇది నా తెలుగుల యెడలో
విదులు దయాదాన ధర్మవీరముల రసా
స్పద మృదుమధుర శివంకర
కథనము ప్రథితప్రముఖ గుణమధువహమున్

అని ఒకచోట కవియే చెప్పుకున్నాడు.
తెలుగు భాష యన్నను, దేశమన్నను వీరి కెంత యభిమానమో !

తెనుగు భాషను గానమ్ము చేరియుండు
దేశ భాషలలోపల తెలుగులెస్స
అష్టపంచాక్షరీ ప్రాణ మమరియుండు
రామనామము నామము లందులెస్స.

త్యాగరాజు గూర్చిన నొక పద్యములో వీరి కవితాభిమానము కూడ కొంచెం తల చూపినది,

చాంపేయములు విరజాజులు విచ్చె నా
కావవి, త్యాగయ్యగారి కృతులు;
కలకంఠములు లతుపులకించి పాడెనా
కాదది, త్యాగయ్యగారి పాట;
రామచిలుకలు కోటి రవళించె నా యేమి
కాదది త్యాగయ్యగారి మాట
నీలకంఠమ్ములు నృత్యముల్ సలిపెనా
కాదది త్యాగయ్యగారి యాట
యనెడువారలు బహుళమై యతని కీర్తి
నాలకించెను తంబ పురాధి నాధు
డతడు శంభుజి సంగీత మన్నప్రాణ
పంచకముకన్న మిన్నగా నెంచు ప్రభువు.

ఈ ధోరణిలో వీరి కావ్యములలోనూ గేయములలోనూ చిత్త శుద్ధి, శైలీ ఒక ఆత్మీయతా ప్రతిఫలిస్తూనే ఉంటవి. సుబ్బరామ శాస్త్రిగారు బహుకార్యదురంధరులు వైవిధ్యరుచిప్రియులు. అలాగకాక ఏ యొక్క కవితా రూపమునైనా వరించి దానిని తమదిగా చేసుకొని ఏ కవిత్వము సాధించినట్లయితే ఎక్కువ కృతకృత్యులు కాగలరేమో! ఇపుడు వెలువడిన యీ కావ్యసంపుటులు విభిన్న రుచులుగల విశిష్టత గల ఒక కవిని పరిచయంచేస్తూ ఉన్నవి. ఇంక రాబోయే కృతులు వీరికి సిద్ధించిన బిరుదు సార్థక్యము పొందదగిన కవితా సామ్రాజ్యాధినేతగా ప్రతిష్ఠచేయునట్టి ఉత్తమస్థాయినందవలెనని సహృదయులాశించుట సహజమే యనుకొందును. శ్రీ సుబ్బరామ శాస్త్రిగారు కావ్య ప్రకాశనయందు చూపు శ్రద్ధాభక్తులు కావ్యరచనలో చూపిన ఇంతకంటె ఉత్కృష్ట రచనలు వెలువరించగలరు.

— శ్రీ వాత్సవ

గ్రంథస్వీకారం :—

జై హింద్—శ్రీ సరిపల్లి సీతారామరాజు
రంగులబొమ్మ—శ్రీ రాజేంద్ర
విశ్వశాంతి—శ్రీ రాచిరాజు కృష్ణమూర్తి
గాంధీ భావరత్నములు ,, ,,
జీవనరాగం—శ్రీ రావెళ్ల వెంకట్రామారావు
నీతి పద్య రత్నములు—శ్రీ చిల్లర సుబ్రహ్మణ్యము
మనజాతీయ జీవితపు
పునర్నిర్మాణము—విద్యార్థుల
కర్తవ్యము—శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య
ద్రోణప్రశస్తి—శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి
వింత ప్రకృతి—శ్రీ జి. వి. రామమూర్తి
గాంధీ సుభాషితములు—శ్రీ లోలభట్టు శివరామకృష్ణంరాజు



హైదరాబాదు హిందీ ప్రేమీ మండలి పక్షాన ఇటీవల హిందీ యోగ్యతాపత్ర వితరణోత్సవము, గ్రీష్మకాల హిందీ తరగతుల ప్రారంభోత్సవము జరిగిన సందర్భంలో తీయబడిన ఛాయా చిత్రము.

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖాధికారి డాక్టర్ ఎస్. రాంలాల్, డాక్టర్ ఎం. చెన్నారెడ్డి M. L. A. గారలను ఈ చిత్రంలో చూడవచ్చు.